


యస్.వి.యస్.ఫిలిమ్స్

# నిండుమనసులు

నిర్మాత యం జగన్నాథరావు దర్శకత్వం యస్ డి లాల్

ఆంధ్ర జోషీపిక్చర్స్ నైజాం ఉషాఫిలిమ్స్ సీడెడ్ విశ్వభారత్ పిక్చర్సు

# తొలిమాట

ఎంత అర్జంటు పనులైనా వాయిదా వెయ్యడానికి కొన్ని మార్గాలున్నాయి. వాటి మానాన వాటిని వదిలేస్తే చెయ్యనవసరంలేని విధంగా పరిస్థితులు సద్దుబాటవుతాయని కె. వి. రామచంద్రమూర్తిగారి సిద్ధాంతం (17 వ పేజీ). దీన్ని 'ఏవల్యూషనరీ మెథడ్' అనవచ్చనుకుంటాము.

*

ప్రియదర్శిని అయిన నిర్మలను కాలం మోసగించిందా? తన్ను తనే మోసగించుకుందా?

[25 వ పేజీ]

*



ఠుమ్రీలు పాడ్డంలో ఉస్తాద్ బడేగులాం అలీఖాన్ వస్తాద్.

[37 వ పేజీ]

*

వచ్చే నెల నుంచి కొత్త సీరియల్

[24 వ పేజీ]

*

చిన్నప్పుడు గొప్ప తెలివితేటలు ప్రదర్శించిన వాళ్ళు పెద్దయ్యాక మామూలుగా మిగిలిపోవచ్చు. చిన్నప్పుడు జడ్డిగా వున్నవాళ్ళు పెద్దై అఖండ మేధావులు కావచ్చు.

[41వ పేజీ]

*

మనసుకు గుచ్చుకుని మరపురాని గుణపాఠం నేర్పిన "తుమ్మముల్లు" కథ.

[60వ పేజీ]




సుచిత్ర మాసపత్రిక

బకింగ్‌హాం పేట పోస్టు

విజయవాడ-2

విడి ప్రతి వెల

80 పైసలు

ఏడాది చందా

9.50 రూపాయలు

సంపుటి 5

సెప్టెంబరు 1967

సంచిక 9

మేనేజింగ్ ఎడిటర్

వి. వి. రాఘవయ్య




ముఖచిత్రం :
చంద్రశేఖరా ఫిలిమ్స్‌వారి
'మూగజీవులు' నుంచి

గవర్నమెంటు రిజిష్టర్డు నెం 218726 Phone No 440206



2 పౌనులు తీసికొన్న తర్వాత



3 పౌనులు తీసికొన్న తర్వాత

బలిష్ఠత చేరిన వెంటనే జీవన్‌టోన్ సేవించటం నిలపడం మంచిది. స్థూల కాయులు జీవన్‌టోన్ తీసికొనుట మంచిది కాదు. అట్టివారు జీవన్‌టోన్ తీసుకుంటే మేము బాధ్యులం కాము. స్త్రీలు కష్టకాలాలలో తీసుకొనగూడదు. ఇతర వివరాలు మందుతో పంపబడతాయి.

వెల: 454 గ్రాములు రూ. 10/- (పోస్టు చార్జీలు అదనం)

**స్కిన్ లీమ్స్** యవ్వనసౌందర్యం కలిగియుండటం వరప్రసాదం. స్కిన్ లీమ్స్ మీ చర్మాన్ని, మొటిమలు, స్ఫోటకపు మచ్చలు, వివర్ణత, కోతలు, శోభినుంచి కాపాడుతుంది. స్కిన్‌లీమ్స్ ముఖమందలి మడ్డి తొలగించిన తరువాత వాడవలయును. మీరు ఏ స్నోనుగాని, పౌడరునుగాని వాడవచ్చును. స్కిన్‌లీమ్స్ ఒక కోర్సు రు. 12/-

**JYOTHI HOSPITAL**, POST BOX No. 1413,
32, VENKATANARAYANA ROAD, MADRAS-17.
స్థానిక డాక్టరు: డాక్టర్ దామోదరం, M. A., I. A. D. S.



# ఆగండి!

నాణ్యమైన
వస్త్రం నిజంగా
ఎక్కువ
వ్యయకారకమా?

అది ట్విన్‌టస్కర్ అయితే మాత్రం కాదు! ఈ వస్త్రాలలోని వైవిధ్యాన్ని మీరు యిష్టపడతారు....మధుర మిల్స్ వారి భారీ ఉత్పత్తి అవకాశమువలన గట్టితనము, ఎక్కువకాలం మన్నిక, అద్భుతమైన పనితనము, సరసమైన ధర నిర్ణయము సాధ్యపడినవి. జ్ఞాపకముంచుకొనండి, సరసమైన ధరకు లభించే నాణ్యతకు ట్విన్ టస్కర్!

మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై
మేనేజింగ్ ఏజంట్లు: ఎ & ఎఫ్ హార్వే లిమిటెడ్

హార్వే



**ట్విన్ టస్కర్**

పాప్లిన్ • డ్రిల్ • లాంగ్‌క్లాత్

సరసమైన
ధరకు నాణ్యత!



మధురకు చేరిన హార్వేవి




మధ్యప్రదేశ్‌లో కాంగ్రెసు ప్రభుత్వం పడిపోవడంతో కాంగ్రెసేతర ప్రభుత్వాల క్రిందికిపోయిన రాష్ట్రాల సంఖ్య తొమ్మిది అయింది. అంటే ఇండియాలో ఎక్కువభాగం కాంగ్రెసు పరిపాలనకు స్వస్తి చెప్పిందన్నమాట.

అంతకు ముందు హర్యానా, ఉత్తర ప్రదేశ్‌లలో జరిగినట్టే మధ్య ప్రదేశ్‌లో మార్పు కూడా చాలా డ్రమెటిక్‌గా జరిగిపోయింది.

36 మంది కాంగ్రెసు శాసన సభ్యులు లెజిస్లేచర్ పార్టీకి రాజీనామా ఇచ్చి ప్రతిపక్షాల సంయుక్త విధాయక్ దళ్‌లో చేరారు. వీరి నాయకుడు శ్రీ గోవిందనారాయణ్ సింగ్.

ముఖ్యమంత్రి శ్రీ డి పి మిశ్రా వెంటనే అసెంబ్లీని ప్రొరోగ్ చేయించారు. తిరిగి అసెంబ్లీ సమావేశం జరిగేలోగా తన బలాన్ని తిరిగి కూర్చుకోవడానికి ప్రయత్నించారు. అప్పుడు అసెంబ్లీ బడ్జెట్ ప్రతిపాదనను చర్చిస్తోంది. అసెంబ్లీలో బడ్జెట్ పై ఓటింగ్‌లో కాంగ్రెసుపార్టీ ఓడిపోతే అసెంబ్లీని రద్దు చేయిస్తానని, తిరిగి మధ్యంతరం ఎన్నికలు జరిపిస్తానని ఆయన బెదిరించారు గాని, ఈ బెదిరింపు పని చెయ్యలేదు. కాంగ్రెసు నుంచి నిష్క్రమించిన శాసనసభ్యులెవ్వరూ తిరిగి కాంగ్రెసులోకి రాలేదు. అంతే కాక, కాంగ్రెసు హైకమాండ్ కూడా మొదట శ్రీ మిశ్రా చర్యలను సమర్థించినా చివరికి తగ్గవలసిందని సలహా ఇచ్చింది. బడ్జెట్‌లో విద్యాశాఖ పద్దుపై జరిగిన ఓటింగ్‌లో వోడిపోగానే శ్రీ మిశ్రా రాజీనామా ఇచ్చారు. గవర్నరు శ్రీ కె సి రెడ్డి సంయుక్త విధాయక్ దళ్ నాయకురాలైన గ్వాలియర్ రాజమాత సలహాపై శ్రీ గోవిందనారాయణ్ సింగ్‌ను మంత్రివర్గ నిర్మాణానికి ఆహ్వానించారు.

ఇప్పుడు మధ్యప్రదేశ్‌లో ఏర్పడిన కొత్త మంత్రి వర్గం చాలా పెద్దది

## మిశ్రా ప్రభుత్వంపోయి మిశ్ర ప్రభుత్వం

అది దిన దినాభివృద్ధి పొందుతోంది కూడా.

కారణం అందరికీ తెలిసిందే. కాంగ్రెసు ప్రభుత్వం పడిపోవడానికి కారకులైన మాజీ కాంగ్రెసు శాసన సభ్యుల్లో వీలైనంతమందికి మంత్రి పదవు లివ్వాలి మరి. అందుకోసమే గదా వారు రాజీనామా ఇచ్చింది?

తొమ్మిదిరాష్ట్రాలు కాంగ్రెసేతర పాలన కిందికి పోతే, ఇక మిగిలినవి పది రాష్ట్రాలు వీటిలో కాశ్మీర్‌ను, నాగభూమిని అలావుంచండి. మిగతా రాష్ట్రాలకు వాటికి కొంత తేడా వుంది పోతే అయిదు రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు మిగిలాయి. —అవి గుజరాత్, మహారాష్ట్ర, మైసూరు, ఆంధ్ర, అస్సాం.

మహారాష్ట్ర, అస్సాంలలో ఫరవాలేదు కాని, మిగతామూడు రాష్ట్రాలలో ఏది జరిగినా జరగవచ్చు. కేంద్రంలో కూడా కాంగ్రెసు కనిపించినంత బలిష్ఠంగా లేదు. అయితే మార్పు జరక్కపోవచ్చు.

ఆంధ్రప్రదేశ్‌లో ఏడుకొండల వాడి దయవల్ల కాంగ్రెసు పని ఇంతవరకు బాగానే వుంది కాని, ఏడు కొండలవాడి దయ ఎప్పుడు ఎలా వుంటుందో తెలియదు కద.

అంతేకాదు. కాంగ్రెసు పని పైకి కనిపించినంత సుష్ఠుగా లేదు 288 సభ్యుల అసెంబ్లీలో కాంగ్రెసు బలం 184. ప్రతిపక్షాల దయ చల్లగావుంటే అది 200 కు పెరుగుతుందని ఆ ధ్య అసెంబ్లీలోనే ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి చెప్పారు. శుభం.

కాని, కాంగ్రెసులో తిరుగుబాటు వర్గం—దాన్నే సయోధ్య వర్గం అంటున్నారు—ఒకటి వుంది. వీరి బల మెంతో ఖచ్చితంగా ఎవరూ లెక్క కట్టినట్టులేదు వారికే తెలియదేమో వారు ముఖ్యమంత్రి మీద, ఇతర మంత్రులమీద, ముఖ్యమంత్రి వర్గం మీద ఆరోపణలమీద ఆరోపణలు చేస్తున్నారు హైకమాండుకు ఫిర్యాదులపై ఫిర్యాదులు చేస్తున్నారు. బహిరంగంగా ముఖ్యమంత్రి వర్గం "నిరంకుశత్వాన్ని, అవినీతిని, ఆశ్రిత పక్షపాతాన్ని" విమర్శించేస్తున్నారు. ఈమధ్య కొత్త ప్రోగ్రాం పెట్టుకున్నారు కొందరు కొందరు కలిసి జిల్లాలలో పర్యటించి ముఖ్యమంత్రి పరిపాలన ఎలా వుందీ తనిఖీ చేస్తున్నారు ఆయనపై వ్యతిరేక సాక్ష్యాలను పోగుచేస్తున్నారు ఆ సాక్ష్యాలతో ఏం చేస్తారో తెలియదు.

కాంగ్రెసుపార్టీకి సంబంధించినంతవరకు నాయకత్వాన్ని హైకమాండుగాని, మరొకరుగాని మార్చే ప్రశ్నలేదు ఎందుకంటే పార్టీలో శ్రీ బ్రహ్మానందరెడ్డిదే మెజారిటీ

---

నాగార్జున ప్రాజెక్టువద్ద అగస్టు 4 న తేదీన ప్రధాని ఇందిరా గాంధి ప్రారంభోత్సవం చేసిన జవహర్ కెనాల్

ఇకపోతే, తిరుగుబాటువర్గం తమకు తగినంతబలం వుందని తేల్చుకోగానే కాంగ్రెసుకు రాజీనామా ఇచ్చి మరో పార్టీ ఏదో పెట్టుకుని, ప్రతిపక్షాలతో కలిస్తేనో? అప్పుడు కాంగ్రెసు మైనారిటీ పార్టీ అయితే, న్యాయకత్వం దానంతట అదే మారిపోతుంది.

కాని, అంతవరకుపరిస్థితివస్తుందా? రాకపోవచ్చు హార్యానా, యు పి. లలో జరిగినట్లు ఇక్కడ జరక్కపోవచ్చు. ఏం జరిగినా పదవుల కోపమేగదా? ఎందుకైనా మంచిదని శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గ సంఖ్యను పెంచే అవకాశం లేకపోలేదని ఒక మాట వదిలారు. మరి




కొందరికి పదవులు దొరికితే, తిరుగుబాటువర్గం బలం ఇంకా తగ్గిపోతుంది.

మొత్తంమీద, ఇదంతా కాంగ్రెసును, దేశాన్ని కూడా ఆవహించిన ఒక జాడ్యానికి నిదర్శనం. అదే పదవీ వ్యామోహం జాడ్యం. దీ వల్ల ఏ శాసన సభ్యుడు ఏ రోజున ఏ పార్టీలో వుంటాడో చెప్పడానికి వీల్లేక పోతోంది. కోట తిరగేసినంత తేలిగ్గా పార్టీల మార్పు జరిగిపోతోంది.

దీనికి మందు ఒక్కటే. శాసన సభ్యులు పార్టీలు మారదలిస్తే అసెంబ్లీ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి, తిరిగి ఎన్నికల్లో పోటీ చేయాలి. ప్రజా ప్రాతినిధ్యం చట్టాన్ని ఈ నిబంధన పొందు పరుస్తూ సవరి చాలి. ఈ స్థితిలో ఇదే మంచి పద్ధతి.

* * *

క్రిందటి నెల "రాజకీయాలు" శీర్షికలో మధ్యప్రదేశ్‌లో మద్యనిషేధం రద్దు గురించి మా వ్యాఖ్యానంతో ఏకీభవిస్తూ ఒక పాఠకుడు ఇలా రాశారు:

"జ్యోతి జోకే చివరికి నెగ్గింది మధ్యప్రదేశ్‌లో ఇకమీద ధాను ఒత్తుపడకపోయినా ఇబ్బందిలేదు అక్కడప్రొహిబిషన్ తీసేశారుగా."

ఈ నెలలో మైసూరులో కూడా ప్రొహిబిషన్ ఎత్తేశారు.

మద్రాసుమాత్రం ప్రొహిబిషన్‌ను

కె వి రామచంద్రమూర్తి

# పోస్ట్‌పోన్ మెంటాలిటీ

పోస్టుపోన్‌మెంట్ అంటే అచ్చ తెలుగులో వాయిదా వెయ్యడం దీనికి సంబంధించిన మనస్తత్వాన్ని - లేదా మెంటాలిటీనే- 'జ్యోతి' వరి భాషలో పోస్టుపోన్ మెంటాలిటీ అంటారు

దీనికిన్ని పోస్టుపూన్ మెంటాలిటీకిన్ని చాలా తేడావుంది అది వేరు ఇదివేరు ఇవాళ ఇవ్వవలసిన ఉత్తరాన్ని, మనియార్డరునో, రేపిద్దాంలే అని పోస్టు బంట్రోతు అనుకుంటే అది పోస్టుపూన్ మెంటాలిటీ అవుతుంది ప్రస్తుతానికి దాన్ని వాయిదా వేసి ఈ పోస్టుపోన్ మెంటాలిటీ ఏమిటో దానివల్ల లాభాలేమిటో విచారిద్దాం

ఇవాళ చేయవలసిన పనిని రేపటికి వాయిదా వెయ్యవద్దని పెద్దలు అంటూవుంటారు పెద్దవాళ్ళ మాటని మన్నించక పోవడం మంచిది కాదు గనక చాలామంది ఇవాళ చేయవలసిన పనిని రేపటికి కాకుండా, ఎల్లుండికి వాయిదా వేస్తూవుంటారు పోస్టుపోన్ మెంటాలిటీలో వుండు కున్నటువంటి ప్రధాన రహస్యం ఇదే.

అయితే, ఒక ముఖ్యవిషయం గమనించాలి చాలామంది వాళ్లు బద్ధకంచేత సోమరితనంచేత పనులు వాయిదా వేస్తూ వుంటారు వాళ్ళని బద్ధక చక్రవర్తులని బద్ధక సార్వభౌములని బద్ధక శిరోమణులని రకరకాల పేర్లతో పిలుస్తారు అటువంటి వాళ్ళని మనం ఎన్నడూ క్షమించ కూడదు, సహించ కూడదు.

బద్ధకంవల్ల ఏ పనీ చేయలేక పోవడానికి 'వాయిదా' ను ఒక జీవిత విధానంగా— ఒక 'వే ఆఫ్ లైఫ్' గా— ప్రాక్టీసు చేసేవారికి చాలా తేడావుంది ఒకానొకని



పోయినా వేస్తున్నామంటే దాని వెనకాల బోలెడు ఫిలాసఫీ బోలెడు లాజిక్ వుండాలి అదే అసలైన పోస్టుపోన్ మెంటాలిటీ

కోర్టులు చూడండి దావాలను వాయిదా వేస్తూ వుంటాయి ఎందువల్లనంటారు? వాళ్ళ బద్ధకం వల్లనా? ఇంతమాత్రం కాదు వాయిదాల మీద వాయిదాలు వేస్తూ వుంటే వాది, ప్రతివాదులిద్దరికీ కేసుమీద మోజు పట్టుదల సన్నగిల్లిపోతూ వుంటాయి మరోపక్కన మామూళ్ళు ముడుపులు ప్లీడరు ఖర్చులు సాక్షుల ఖర్చులు రానూ పోనూ ఖర్చులు అన్నీ కలిసి తడిసి మోపెడవుతాయి, చలం వదిలిపోతూ వుంటుంది. చివరికి వాది ప్రతి



వాదులు ఈ బాధలు ఖర్చులు భరించలేక తమలో తామే రాజీపడతారు అదిగో, అలా వారిలో వారే రాజీ పడేట్టుచేసి, వాళ్ళని మంచిమార్గంలో పెట్టడానికే కోర్టులు సాధారణంగా వాయిదా పద్ధతిని అవలంబిస్తూ వుంటాయి.

కాని, అసలు సిసలు నిఖార్సయిన పోస్టుపోన్ మెంటాలిటీ కావాలంటే ప్రభుత్వాలు పనిచేసే విధానాన్ని పరిశీలించాలి వాయిదా వెయ్యడం అనేది ప్రభుత్వాలకి ఉగ్గుపాలతో పెట్టిన విద్య

ఇబ్బంది కలిగించే సమస్య ఏది వచ్చినా (ఇబ్బంది ప్రజలకు కాదు — తమకు) ప్రభుత్వం ముందుగా ఒక కమిటీని వేస్తుంది ఆ కమిటీ ఏడాదిపాటు — లేదా రెండేళ్ళపాటు ఆ సమస్యని క్షుణ్ణంగా దర్యాప్తు చేసి నివేదిక తయారు చేస్తుంది అది సాధారణంగా కొన్ని వందల — వేల పేజీలలో వుంటుంది కనక దాన్ని చదివే వోపిక లేక దానిలోని సారాంశాన్ని, మంచి చెడ్డలని పరిశీలించి సలహా ఇవ్వవలసిందంటూ ప్రభుత్వం ఒక సబ్ కమిటీని వేస్తుంది ఆ కమిటీ మళ్ళీ అన్నేళ్ళో ఏదో పరిశీలన జరుపుతుంది ఈలోగా అసలు సమస్యస్వరూపం మారిపోయి పాత నివేదిక పనికిరాక కొత్త కమిటీని వేయవలసిన అగత్యం ఏర్పడుతుంది ఈలోగా ప్రజలు అదృష్టవశాత్తు ఆ సమస్యని మరిచిపోయినా పోవచ్చు లేకపోతే అంతకంటె పెద్ద సమస్య ఏదో రావచ్చు దాని మీద మళ్ళీ ఓ కమిటీని వేయడం జరుగుతుంది ఇలా అది అనంతంగా సాగిపోతూ వుంటుంది

అందుచేత వాయిదా వెయ్యడంలో ప్రభుత్వానికి మించిన నేరగాడెవ్వరూ వుండరు అసలు

అలా వాయిదా వెయ్యడంతో సిద్ధహస్తులైన వాళ్ళనే మంత్రులుగా తీసుకుంటారట కూడాను.

ఈ మధ్యనే ఒకసారి లోక్‌సభలో ఎవరో అన్నారు కూడా—'ప్రభుత్వం పరిశీలిస్తోంది' అంటే ఫైలు కనబడ లేదని అర్థం. 'తీవ్రంగా పరిశీలిస్తోంది' అంటే ప్రభుత్వం నిద్దరోతోంది అని అర్థం.

చూడండి—ఇప్పుడు దేశంలో అన్నిటికీ కరువుగా వుంది గదా? బియ్యం, పాలు, పంచదార, ఉప్పులు, పప్పులు, అప్పులు—ఏవీ సక్రమంగా దొరకడం లేదుగదా? అయినప్పటికి ప్రభుత్వం ఏమీ చేయడం లేదని మనం ఎప్పుడూ అనుకోగూడదు. 1980 నాటికి దేనికీ కరువు వుండదనీ, ప్రజలకి కావలసిన తిండీ, బట్ట, మందులు, చదువులు, ఇళ్ళు, వాకిళ్లు అన్నీ పుష్కలంగా లభిస్తాయని మంత్రులు, ముఖ్యంగా కాంగ్రెసుపార్టీ పెద్దలు మనకి హామీలిస్తూ వుంటారు. అంటే ఏమిటి? ప్రజల్ని అదే పనిగా వేధించే సమస్యల్ని ఓ పది, పదిహేనేళ్ళపాటు వాయిదా వేస్తున్నారన్నమాట. పది, పదిహేనేళ్ళ తరవాత ఏం జరుగుతుందో ఎవడు చూడొచ్చాడు? అంతగా అయితే ఏ 1979 లోనో ఇంకో ప్రకటనచేస్తే సరి—1990 నాటికి ప్రజలకి పుష్కలంగా లభించేట్టు చేస్తామని.

ఇదుగో, ఇలా వాయిదాలు వేసి, వాగ్దానాలుచేసి కాంగ్రెసు ప్రభుత్వాలు ఇన్నాళ్ళనుంచి, ఇన్నేళ్ళనుంచీ పబ్బం గడుపుకుంటూ వస్తున్నాయి. అసలు, వాళ్ళ వాగ్దానాలు వింటుంటేనే దేశంలో కరువనేది




లేనట్టు, అయిదో ఉక్కు ఫ్యాక్టరీ వచ్చేసినట్టు, అంతా సుఖంగా వున్నట్టు భ్రమ కలుగుతుంది.

నే నింతకీ చెప్పొచ్చే దేమిటంటే — ఇలా వాయిదాలువేసి మభ్యపెట్టే చాకచక్యం చాలామంది వ్యక్తుల్లో కూడా కనిపిస్తుంది. కష్టపడి ఏ రోజు పని ఆ రోజు చేసే వాళ్ళకంటే వాళ్ళే సుఖంగా, చిద్విలాసంగా వున్నట్టు కనబడతారు. వాయిదాలు వెయ్యడాన్ని ఒక లలిత కళ స్థాయికి తీసుకువెళ్లిన మహానుభావుల్ని నేను చాలామందిని ఎరుగుదును.

అయితే, వాయిదాలు వెయ్యడం చాలా తేలికని మీరనుకుంటే పొరబడుతున్నారన్నమాటే. పని చెయ్యడంకంటె, పని చెయ్యకపోవ

దమే కష్టం. ఎంతో తపస్సు చేస్తే గాని అందులో నేర్పు సిద్ధించదు. అదృష్టవశాత్తు దీనికి కొన్ని యంత్రాలున్నాయి. నాకు తెలిసినంతవరకు వాటిని మనవి చేస్తాను.

అన్నిటిలోకి ముఖ్యమైన సూత్రం— పని చేస్తున్నట్టు కనబడాలి. లేకపోతే చెయ్యబోతున్నట్టు కనబడాలి. ఈ కనబడడం ఎంతవరకూ కొనసాగాలంటే ఆ పని చెయ్యవలసిన అవసరం ఈలోగా తీరిపోవాలి.

ఈ సూత్రంవల్ల మనం సాధారణంగా ఉత్తరాలు రాయవలసిన బాధ తప్పించుకోవచ్చు. మనకి ఉత్తరాలు రాసే వాళ్ళెప్పుడూ వెంటనే జవాబు రాయవలసిందంటూ రాస్తారు. వెంటనే జవాబు రాయమనుకోండి. ఇహ ఉత్తరం రాయవలసిన అవసరమే తప్పిపోతుంది. ఈ విధంగా బోలెడు పోస్టేజీ ఆదా చేయచ్చు.

కాని, ఈ సూత్రం అవసరం ఇంకా కొన్నిచోట్ల బాగా కనబడుతుంది. మీ పెరట్లో గొండపాదో చిక్కుడు పాదో వుంటుంది. దానికి పురుగు పడుతుంది. మీ ఇల్లాలు మిమ్మల్ని ప్రతిరోజూ ఏదైనా మందు తెచ్చి చల్లమని పోరుతూ వుంటుంది. ఇదిగో ఇవాళ తెస్తాను రేపు తెస్తాను ఏం మందు తేవడమా అని ఆలోచిస్తున్నాను అంటూ కొన్నాళ్ళు కాలక్షేపం చెయ్యాలి. ఈలోగా పాదు కాస్తా పూర్తిగా పురుగుపట్టి ఎండిపోతుంది. అప్పుడు దాన్ని మీ ఇల్లాలే ఏ పని మనిషిచేతో తీయించి పారేస్తుంది.

లేకపోతే మార్కెట్టు నుంచి కూరలు తేవాలని ఇల్లాలు పురమాయిస్తుందనుకోండి. మనం కాలకృత్యాలు తీర్చుకుని, గడ్డం గీసుకుని, స్నానం చేసి, బట్టలు వేసుకుని తల దువ్వుకుని బయలుదేరేలోగా ఆఫీసు టైము అయిపోయేటట్టో, ఇంటి దగ్గరికే ఏ కూరలమ్మో లేదా కూరలబ్బి వచ్చేటట్టో ఆలస్యం చేయాలి.

ఈ సూత్రంతో ఇంత కంటె గడ్డు సమస్యల్ని కూడా చలాగ్గా పరిష్కరించుకోవచ్చు. ఎదిగిన పిల్లకి సంబంధాలు చూడ్డం గురించి అతి తీవ్రంగా పడక్కుర్చీలో కూర్చుని ఆలోచించేస్తూ, చివరికి ఆపిల్ల తన మొగుణ్ణి తానే సెలెక్ట్ చేసుకునేట్టు మేనేజ్ చేసిన పెద్ద మనిషిని నేను స్వయానా ఎరుగుదును.

నాకు తెలిసిన ఓ రచయిత ఉన్నాడు. ఆయన జీవితంలో పట్టుమని ఓ వంద పేజీలైనా రాశాడో లేదో! కాని మంచి రచయితగా పేరు మటుకు వచ్చేసింది. ఆయన్ని ఏ పత్రికా సంపాదకుడైనా తమ ప్రత్యేక సంచికకు ప్రత్యేక వ్యాసం రాయమని కోరితే ఓ తప్పకుండా రాస్తానంటాడు. సంపాదకుడు కనిపించినప్పుడల్లా ఇదిగో మొదలెట్టాను. అప్పుడే ఓ పేజీ రాసేశాను. ఇంకొక్క పాతిక పేజీలు రాస్తే అయిపోతుం అంటూ ఉంటాడు. సగం రాశానని చెప్తు

రాయడం అయిపోతోందని, వాయిదా వేస్తూ వుంటాడు. ఈలోగా సంపాదకుడికి విసుగు పుట్టిగాని తన సంచిక గొడవలో తను ఉండిగాని, ఈయన సంగతి పట్టించుకోడు. సంచిక అంతా ప్రింటయి పోయిందని తెలిసి "ఫెయిర్ చెయ్యడమే తరవాయి. రేపు రాసిస్తాను" అని రచయిత అంటాడు. "ఈ సంచిక్కి టైమయిపోయింది లెండి. మామూలు సంచికలో వేసుకుంటాను, ఇవ్వండి" అని సంపాదకుడు అంటాడు. "అమ్మమ్మ, ఎంతమాట. అది ప్రత్యేక సంచికల కోసమే, ప్రత్యేకం రాశాను. ఈసారి ప్రత్యేక సంచిక్కి ఇస్తాలెండి" అంటాడు రచయిత. ఇలాగ ఆ రచయిత చాలాసార్లు చేసి, ఏమీ రాయకుండానే మంచి రచయిత అనే పేరు చాలా కాలంగా నిలుపుకుంటూ వస్తున్నాడు.

అయితే, ఇదే సూత్రాన్ని జయప్రదంగా అనుసరించే పత్రికా సంపాదకులు కూడా లేకపోలేదు. మనం ఏదన్నా కథో కాకరకాయో పంపిస్తామనుకోండి. మనతో మొహమాటం వుండి, అది వేసుకోడం ఇష్టంలేని సంపాదకుడు ఇదుగో ఈ వారం వేస్తాను వచ్చే వారం వేస్తాను అని వాయిదా వేస్తూ వుంటాడు. వెయ్యనని మాత్రం చస్తే అనడు. చివరికి మనకి వాళ్ళమండి మన రచన మనం తెచ్చుకోవడమో ఏదో చెయ్యాలి.

పోతే ఇంకో సూత్రం—పని చెయ్యడం కంటె చెయ్యక పోవడమే మంచిదని తలావు చెయ్యకరం. ఇది ఆఫీసు మేనేజర్లకి బాగా వర్తిస్తుంది. ఉదాహరణకి మీరు ఒక ఆఫీసుకి మేనేజరనుకోండి. ఉద్యోగం ఇప్పించమని చాలా మంది మొహమాట పెడుతూ వస్తారు.




ఉద్యోగం ఇవ్వనని ఎప్పుడూ అనకూడదు. తనకు ఏ అభ్యంతరం లేదని, అయితే తన ఆఫీసంత దరిద్రగొట్టు ఆఫీసు ఇంకోటిలేదని, ఇక్కడ ఉద్యోగం చెయ్యడమంత బుద్ధితక్కువ ఇంకోటి లేదని అభ్యర్థికి నచ్చచెప్పాలి. అన్ని కష్టనష్టాలకు అతగాడు సిద్ధపడతానన్నా సరే — 'అమ్మమ్మ నిన్ను కష్టపడనిస్తానా? నీ మేలు కోసమే చెబుతున్నాను' అని వాణ్ణి తరిమేయాలి.

నాకు పరిచితుడైన ఒక ఆసామీ పెళ్ళాం బిడ్డలకి ఏడాది కొకసారైనా సినిమా చూపించకుండా ఎలా మేనేజ్ చేస్తున్నాడో చూస్తే నిజంగా మెచ్చ

తీస్తుంది కొత్త సినిమా వచ్చిందనుకోండి—

"చాలా రష్‌గా ఉంటుంది తగాక వెడదా" మంటాడు కొన్ని వారాల పాటు రష్ తగాక "అది చెత్త సినిమా అది చూడ్డమంత పొరబాటు మరోటిలేదు మరో కొత్త పిక్చర్ రాబోతోంది దానికివెడదా" మంటాడు అది వచ్చాక అదీ రష్‌గానే ఉంటుంది మళ్ళి పాత పాటనే కొద్దిగా ట్యూను మార్చి పాడతాడు ఈ విధంగా బాపు చాలా తక్కువ సినిమాలని మాత్రమే చూస్తూ చూపిస్తూ తన ఆరోగ్యం కాపాడుకుంటూ వస్తున్నానని సగర్వంగా చెప్పుకుంటాడు అసలు తెలుగు సినిమాల వల్లనే ప్రజల ఆరోగ్యాలు చెడిపోతున్నాయని డాక్టర్లు బాగుపడుతున్నారని ఆయన సిద్ధాంతం

ఇలాగే ఇంకా చాలా సూత్రాలున్నాయి గాని వాటిని తర్వాత ఎప్పుడైనా చెబుతాను ఈ టాపిక్ వాయిదావెయ్యబోయేముందు పోస్టుపోన్ మెంటాలిటీ అలవరచుకో దలచిన వాళ్ళకి కొన్ని తారక మంత్రాలు ఉపదేశిస్తాను

(1) "చేద్దాం, చూద్దాం, రాద్దాం వేద్దాం" అనే బీజాక్షరాలను అహోరాత్రులు స్మరిస్తూ ఉండాలి

(2) "ఏ సంగతీ రెండు మూడు రోజుల్లో చెబుతాగా!" (అంటే వారం రోజులదాకా నీకు మళ్ళీ కనబడను అని అర్థం)

(3) "ఇది అల్లాటప్పా విషయం కాదు జాగ్రత్తగా ఆలోచించి మరీ చెయ్యాలి (చెయ్యడం కంటె ఆలోచించడమే ఎప్పుడూ సులువు)

(4) "మా ఇంట్లో వాళ్ళతో కూడా ఆలోచించి చెబుతాను" (తన కిష్టమే గాని, ఇంట్లో వాళ్ళు వద్దంటున్నారని చెప్పి తప్పుకోవచ్చు)

(5) "రేపు సాయంత్రం మీ ఇంటికి వస్తాను తీరుబడిగా దీన్నిగురించి ఆలోచిద్దాం" (రేపు మీకు మరో అర్జంటు పని తగలకపోతుందా?)

(6) ఇదుగో, నీ పని మీదే ఉన్నాను" (నీ పని మీద లేనని అర్థం)

ఇలాగే, అవసరాన్నిబట్టి, పరిస్థితిని బట్టి ఇలాటి తారక మంత్రాలను సృష్టించుకుంటూ ఇబ్బంది కలిగించే పనులన్నిటిని వాయిదావేస్తూ తప్పించుకు తిరిగే వాళ్ళనే ధన్యులన్నారు పెద్దలు

***

---



## ఫిలమెంటాలిటీ

నిత్య జీవితంలో ఉపయోగపడే వస్తువులను కనిపెట్టిన సైంటిస్టులలో అగ్రగణ్యుడు థామస్ ఆల్వా ఎడిసన్ అతడు కనిపెట్టిన వైజ్ఞానిక పరికరాలకు లెక్కలేదు.

ఎలక్ట్రిక్ బల్బును కనిపెట్టింది అతడే అయితే దానికోసం అతడు చాలా శ్రమ పడవలసి వచ్చింది బల్బులో ఫిలమెంటుగా ఉపయోగపడే లోహంకోసం అతడు కొన్ని వందల ప్రయోగాలు చేశాడు అయినా ఏదీ పనికిరాలేదు అతని శ్రమ అంతా గమనిస్తున్న ఒక మిత్రుడు "పాపం" అని జాలిపడ్డాట్ట

కాని, ఎడిసన్ ఫరవాలేదు నా ప్రయోగాలేమీ వృథాపోలేదు" అన్నాడు

"అదెల్లా ?" అన్నాడు మిత్రుడు

"ఫిలమెంట్‌గా ఎన్ని వందల వస్తువులు పనికిరావో కనిపెట్టాను కదా !" అని ఎడిసన్ సమాధానమిచ్చాడు

* * *

## గణిత సంగీతం

స్పెసిఫిక్ గ్రావిటీ సిద్ధాంతాన్ని ఆర్కిమెడిస్ తొట్టిలో స్నానం చేస్తూ కనిపెట్టాడట న్యూటన్ చెట్టుకింద కూర్చుని పైనుంచి యాపిల్ పండు పడడం చూసి భూమ్యాకర్షణ శక్తిని కనుక్కున్నాడట

ఐన్‌స్టీన్ పియానో వాయిస్తూ సాపేక్షసిద్ధాంతాన్ని కనుక్కున్నాట్ట

ఒకసారి ఐన్‌స్టీన్ మేడమీదించి దిగివచ్చి భోజనానికి కూర్చున్నాడు కాని ఏమీ సయించలేదు లేచి, పియానో వద్దకువెళ్ళి కాసేపు వాయించాడు మధ్యలో ఆగి కాగితం, కలం పుచ్చుకుని ఏవో లెక్కలు వేశాడు మళ్ళీ పియానో ముందు కూర్చుని చేతికొచ్చిందేదో వాయించాడు తిరిగి లెక్కలు వేశాడు మళ్ళీ పియానో




ఇలా అరగంట గడిచింది చివరికి మేడమీద తన గదికి వెడుతూ తన్ను ఎవరూ పలకరించవద్దని చెప్పాడు రెండు వారాల తరవాత మేడదిగి వచ్చాడు మనిషి పాలిపోయి నీరసంగా వున్నాడు టేబుల్ మీద రెండు కాగితాలు వదేసి అమ్మయ్య అనుకున్నాడు ఆ రెండు కాగితాల్లోను భౌతిక శాస్త్రంలో నూత్న విప్లవం తీసుకు వచ్చిన థియరీ ఆఫ్ రెలెటివిటీ అలా వుంది

ఐన్‌స్టీన్‌కు గణితశాస్త్రం తరవాత అభిమాన పాత్రమైన విషయం సంగీతం గణితాన్ని ప్యూర్ సైన్స్ అంటారు సంగీతాన్ని ప్యూర్ ఆర్ట్ అంటారు అంటుంటే బహుశా పియానోమీద స్వరాలు పలికిస్తుండగా అద్భుతమైన సిద్ధాంతం ఐన్‌స్టీన్‌కు స్ఫురించి వుంటుంది

— "శేఖర్" వాల్తేరు

## వంశ పారంపర్యం

భౌతిక శాస్త్రానికి సంబంధించిన ఒక విషయం వెల్లడించిన ఒకవ్యక్తికి నోబెల్ బహుమతి లభించింది దరిమిలా దానిని ఖండించిన మరొక వ్యక్తికి నోబెల్ బహుమతి లభించింది

1906లో జె జె థామ్సన్ ఎలక్ట్రాన్స్ అణువులని నిరూపించి ఫిజిక్సుకి సంబంధించిన నోబెల్ బహుమతి పొందాడు 1937 లో జార్జి థామ్సన్ ఎలక్ట్రాన్స్ అణువులు కాదు తరంగాలని రుజువు చేయగా అతనికి నోబెల్ బహుమతి లభించింది.

ఎలక్ట్రాన్స్ మీద పరిశోధనకు నోబెల్ బహుమతి పొందిన ఈ ఇద్దరు థామ్సన్లూ తండ్రీ కొడుకులు.

— "బంటి", మద్రాసు

స్వర్గయోగంలో ముంచెత్తి మలామా చేస్తోంది. నల్ల గచ్చుమీద చెల్లా చెదురైపోయిన మంచి ముత్యాల్లాగ నీలిగగనంలో కొంగల జంటలు గుంపులుగుంపులుగా జారిపోతున్నాయి. సముద్రంలో ఆకాశం షోకు చేసుకుంటోంది. పన్నూ మిన్నూ ఏకమైపోయి పరవశం చెందిపోతున్నాయి. అన్నీ లోకంలో మైమరచిన జంటలే, కాని నిర్మలే ఒక్కర్తి. చక్కదనాల చుక్క, చదువులతల్లి. సొగసు లేదా, యోగం లేదా? కలిమి లేదా, అంతసు లేదా? తనకేం లోటుంది? ఏం లోపం వుంది? జీవితంలో ఒంటిగాడే కరువైపోయేడు!

"ఏం?.... నాకేం తక్కువనీ?.... నే నెందుకిలా వుండిపోయేను! భగవంతుడా ... ఆడపడుచుకేం కావాలి? ... తాళిబొట్టు, మంగళవాద్యం ... ఇంత చిన్న వరం ఇవ్వలేవా?... ఈ బతుక్కింక వసంతం లేదా.... ఇంతేనా.... మోడై వడిలి వాడిపోవలసిందేనా!... అంతేనా.... అంతేనా" అనుకుంటూ నిస్పృహగా నిట్టూర్చిందినిర్మల.

తన వాలుచూపు కోసం, చక్కని నవ్వులకోసం, వలపుకోసం, సగపుకోసం ఎంత మంది తహతహలాడే వారు! ఎంతమంది ఆరాధించేవారు? ఒక్కరేనా అంకితం చేసుకున్నారా? చిగురులు రాలి తీగలు సాగుతున్న పందిరినే చప్పరించి చెక్కర్లుకొట్టి చక్కాపోదామనుకున్న కందిరీగలే అందరూ. పరికని మనసిస్తుంది? ఎలా అర్పించుకుంటుంది? తీరా నోరువిప్పి ప్రపడితే పెళ్ళా అని వడుగులు తారు. ఆఫీసుల్లో, దిన్నల్లలో, కాలేజీ రెస్టుల్లో అందరికీ ఒక సాహచర్యం కావాలి. సహజీవనం అంటే మొహం మొత్తుతుంది. మర్యాదగా ఒక్కరూ ముందుకిరారు. వచ్చినా వాళ్ళంతా పెళ్ళాం, పిల్లలతో వచ్చుగా వున్నవాళ్ళు. "పెళ్ళైన వాళ్ళకిదేం పోయే కాలం? ఇంట్లో ఇల్లాలుండాలి. ప్రేమకి ప్రియురాలు కావాలి ... అమ్మ బాబోయ్ దొంగపెద్దవులు ... వీళ్ళని నమ్మితుంటే యింకేమైనా వుందా.... కక్కలేక పట్టుకుని గోదావరీదినట్టే ... హమ్మో ..." అని బతుకుజీవుడా అన్నట్టు అప్పుడప్పుడు గుండెలదుముకుంటుంది నిర్మల

వయసు దాగుతుందా? వంపులూ సొంపులు దాగుతాయా? రాబందులా రెక్కలు విప్పి గాలి గుమ్మరిస్తూ కుంటూ మీదపడే కాలాన్ని ఎవరాపగలరు? గీత బాగుండాలి. సమయం రావాలి, తగినవాడు దొరకాలి. ఎన్నో కలిసిరావాలి ఆలోచనల్లో, అనుమానాల్లో, విమర్శల్లో, వితర్కల్లో కాలం దొర్లిపోయింది. ముప్పయో పడిలో పడిపోయింది నిర్మల.

"అయ్యో అయ్యో ... ముడులుండా ... వాటిలో ముచ్చటైన కెంపులుండాలి ఏవీ? ... కెంపులేవీ?.... ఏమైపోయాయి చెప్మా" అనిపాపోతూ గాబరాగా బుగ్గల్ని తడుముకుంటూ ముందుకి వంగి అద్దంలో మరీ మరీ చూసుకుంది నిర్మల.



"ఇదిగో ఇక్కడి కెంపులే నిర్మలమ్మా .... కరిగిపోయి, కరిగిపోయి నాదింపబడి పోయేయి తల్లీ నిర్మలా.... కాలంలో కలిసిపోయేయమ్మా" అని నవ్వుతూనే వెక్కిరించింది, అద్దంలో నిర్మల.

"నా కర్మ .... ఎందుకిలా నవ్వుతావు ? నేనేం అన్యాయం చేసేను కాలానికి ?.... నన్నెందుకింత చిన్న చూపు చూసింది కాలం ? నన్నెందుకు దగా చేసింది ... నా సంపదెందుకు దోచుకుంది ? కాలమంటే నాకెంత గౌరవం ! దానికేనా కాలం చూపించవలసిన మర్యాదా!... హుఁ" అని నిస్పృహపోయుంగా, పుడుకపోతుతనంలో కొంగు నోట్లో కుక్కుకుని దుఃఖ పడింది నిర్మల.

"కాలాన్ని గౌరవించేనని పెద్ద కబుర్లు చెబుతున్నావే! కాలాన్ని... నువ్వు ...గౌరవించేవా! ఎవరి దగ్గర కొస్తున్నావే నిర్మలా ... ఒంటిమీద తెలివుంచుకుని మాట్లాడవే" అంటూ హెచ్చరించింది నిర్మల ప్రతిబింబం.

"ఎందుకు ?"

"ఎందుకా ? నువ్వు కాలానికి బానిసవి, నిర్మలా. ప్రగల్భాలెందుకు

పలుకుతావు. గొలుసుపట్టుకున్న యజమాని వెనక వెంబడించి పోతుంది కుక్క. పోకేం వస్తుంది?"

"నేనా!... నేనా!" అని నిశ్చేష్టురాలై పోయింది నిర్మల.

"ఆహా నువ్వే నువ్వే. ముమ్మాటికీ నువ్వే కొంచెం జ్ఞాపకం తెచ్చుకో... కాలం నీకు మంచికాలంలో వున్న సుందరాన్ని చూపించింది. నీ ముందు వాడు సుందరం నీ కొంగుపట్టుకు తిరిగేడు. నువ్వతడి కళ్ళల్లో ఎన్ని మార్లు దాగున్నావు! చూపుల్లో ఎన్నెన్ని కథలు చెప్పేవు? ఎన్ని వలపులు గుప్పించేవు? సుందరం నిన్ను ఆరాధించేడు మనసిచ్చేడు, ప్రేమించేడు. నీ జీవితంలో అడుగుపెట్టేడు సుందరం. నువ్వెందుకు చెయ్యివ్వలేదు? ఏం వద్దన్నావా? ఊఁ? ఎందుకు వుసురు పెట్టేవు? మాట్లాడవేం?... నువ్వెందుకతని జీవితంలో జొరబడలేదు? చెప్పు?" అంటూ ఫెళఫెళా నిలదీసి అడిగింది గాజు పంజరంలో నిర్మల.

ఉలికిపడింది నిర్మల. తన పేరు వింటేనే మైకం కమ్మేది సుందరానికి ఎంత మత్తుగా చూసేవాడు సుందరం! తనొక్కరోజు కాలేజీకి రాకపోతే గంగవెర్రులెత్తిపోయేవాడు. తనెందుకు సుందరంలో ఐక్యం కాలేకపోయింది? పోనీ పెళ్లి చేసుకుందాం అని సుందరం ముందుకి రాలేదూ?... అడిగేడా?

"అడుగుతాడా? వెర్రిమొహమా. మనసు పసిగట్టి, చూపుల్లో భావం చదువుకోలేవూ? పెద్ద చదువులు చదివిందట మొద్దు పెద్దమ్మ. అర్థమయ్యేలా చూడాలి అడిగీ అడగనట్టు ఆ విషయం కదిపి పిచ్చెక్కించాలి. ఆ మత్తులో పెళ్లి మాట అడిగించుకోవాలి. అంతే గాని "నాకేం తక్కువైనదాన్ని. కావలసిన వాళ్ళే వస్తారనుకుని బిగుసుక్కూచుంటే ఎలా? ఇంతకీ ఏముంది అందం? సంధ్యకన్న చక్కనిదానివా? వెన్నెలంత చల్లనిదానివా? వాటిని ఆరాధిస్తారు కాని ప్రేమించి పెళ్ళాడతారంటే పిచ్చిదానా. కొంచెం ఆలోచించే నిర్మలా. పోనీ నువ్వే అడగలేకపోయేవూ? ఏం నామోషీయా?" అని సాధించింది. నిర్మల అందం, అద్దంలో అందాల నీడ.

"అబ్బ! చాలేవే బాబూ. తవ్వు దాచికితే సాగదీస్తావు. సరే అడిగేనే అనుకో...అబ్బ! ఎలా అడగమన్నావే? సిగ్గూ శరం వున్న ఏ ఆడదైనా నోరు విప్పి అడగ్గలదా?.... మగసిరిగలవాడు మనసిచ్చి మనుగడ కావాలంటే కాదంటానా? ముందుకి రావాలి, అడగాలి .... ఆడవాళ్ళడుగుతారేవిటంటే? మరీ చోద్యం చెబుతావు" అని ఆవేశంగా సమర్థించుకుంది నిర్మల.

"నువ్వు తగనన్నానా?" అంది అద్దంలో నిర్మల.

"ఏం అడగొద్దన్నానా మంత్రం వేసేనా, కనికట్టు చేసేనా?"

"ఆఁ ఆఁ.... వాడికి మతిపోయిందాకా అవిపో చేసే వుంటావు. నీ పాదాలు పట్టుకునే సమయానికి వచ్చి వాళ్ళతో వేగడంవెలాగని తప్పించుకు తిరిగేవు. ముప్పుతిప్పలూ పెట్టి మూడు

చెరువుల నీళ్ళు తాగించేవు.... తెలివి తెచ్చుకున్నాడు సుందరం, తప్పుకున్నాడు"

"తప్పంతా నామీదే రుద్దుతున్నావు. ఎక్కడి తంజావూరు, ఎక్కడి సుందరం? తెలుగువాడా, ఒకే కులంవా? కాదు. పోనీ అవన్నీ ఎలాగో సర్దుకుందాం అనుకున్నా బామ్మేమైపోవాలి? సుందరం బామ్మని ఆదరిస్తాడా? మధ్యనీ ముసలేవిటని ఛీదరించుకుంటే బామ్మేమైపోతుంది! బెంగెట్టుకు చచ్చిపోదూ...." అని లోలోపల గొణుగుకుంది నిర్మల.

"నువ్వేమనుకుంటున్నావో తెలుసులే. ఎంత చదివినా ఇంగితజ్ఞానం లేదే నిర్మలా కన్నె చెరవిడి పిల్ల వెళ్ళిపోతుందంటే తల్లైనా బామ్మైనా ఏ అవధి సంతోషంగా కంటికి దూరమవడానికి యిష్టపడదంటావు? .... పెళ్ళవలేదని కంట తడిపెట్టే బామ్మ నువ్వు పెళ్ళికూతురైతే గుండెమీద కుంపటి దించుకుని కారుణ్యం కురిపిస్తూ అత్తారింటికి సాగనంపుతుంది.... అదృష్టం ఒక్కమారే తలుపు తడుతుందే నిర్మలా. కనురెప్పలాడిస్తూ పలకరించేడు. తలుపుతెరవమన్నాడు వినిపించుకోనట్లు వూరుకున్నావు అవునా?"

"అదేంకాదు. అన్నీ నువ్వే అల్లుకుంటున్నావు" అని అబద్ధం ఆడింది నిర్మల.

"పోనీ ఏమనుకుంటున్నావో చెప్పు?" అని సాధించింది అద్దంలో బింబం.

"నువ్వన్నట్లు సిగ్గువిడిచి అడిగేననుకో. తీరా సుందరం ఒప్పుకోకపోతే సిగ్గు సిగ్గు. అడిగితే ఒప్పుకుంటాడని నమ్మకం వుందా? తనే తలెత్తకపోయేడూ. ఒక్కసారైనా నోరుతెరిచి అడిగితే రత్నాలు రాలిపోతాయా. అడిగితే అతనిదేం పోయింది?" అని తప్పేం లేదని చెప్పబోయింది నిర్మల.

"సుందరం అడిగితే నువ్వు "ఊ" అంటావని నమ్మకం వుందా?"

"నన్నంతేనా అర్థం చేసుకున్నాడు సుందరం?"

"సుందరాన్నంతేనా అర్థం చేసుకున్నావా?"

"సుందరంవే అడిగుంటే కరిగిపోయి అమాంతం అతనిలో లీనమైపోయేదాన్ని."

"ఈ కబుర్లకేంలే. అడిగిందాకానే"

"ఎందుకలా ఎత్తిపొడుస్తావు.... ఎవడేనా సరే ముందుకొచ్చి పెళ్ళాడమని అడిగితే చెయ్యిజాచితే అందుకొని మనసారా అంకితమైపోనూ. అయినా నా వెర్రిగాని ఈ వయసులో అన్నీ వడలిపోయిన నన్ను చూసి మోజుపడేవాడెవడు? ఇంకా నాకు పెళ్ళయ్యేటంత అదృష్టమా ఈ జన్మకి? అని నిరాశతో వుసూరుమంది నిర్మల.

"ఆ కబుర్లేనా, లేకపోతే నిజంగానా? చూస్తానుగా" అంటూ అకస్మాత్తుగా మసకబారిపోయింది అద్దం.

రెప్పలార్చకుండా వెలితిచూపుల

చూస్తూ అద్దం ముందు ఆలోచిస్తూ కూర్చుండిపోయింది నిర్మల. ఆనందమయ ప్రపంచంలో అణిగి పొంచివున్న చింతలా, ఆకాశంలాంటి నిర్మల విశాల నేత్రాలలో నీలి కెరటాలు రెపరెపలాడుతున్నాయి. ఆమె కళ్ళలో నీలంగా వేదన ప్రవహిస్తోంది. చేరేసిన తలుపులు తోసుకుని గదిలో ప్రవేశించేడు ఎదురింటి మోహన్. చేతిలో పుస్తకాన్ని మడతల చుట్టేస్తూ నవ్వుతూ అద్దంలోకి చూస్తూ నిల్చొన్నాడు. అద్దంలో నిర్మల కొంటె నవ్వు నవ్వింది మోహన్ వచ్చేడన్న సందడికో అద్దంలో గూడుపఠాణీ కనిపెట్టలేదు నిర్మల. అద్దంలోంచి మోహన్‌నిచూస్తోంది నిర్మల. మోహన్‌ని చూస్తున్న నిర్మలని ఓ కంట కని పెడుతోంది అద్దంలో నిర్మల.

"రండి రండి మోహన్ గారూ... కూర్చోండి ... నూరేళ్ళాయుష్షు మీకు... మీ గురించే అనుకున్నాము ... ఇప్పుడిప్పుడే, కబురంపుదామను కుంటున్నాము ... ఇంతలోనే వచ్చేరు. ఇక్కడికి ముందుకి లాక్కొని కూర్చోండి... ఐ జస్ట్ థాటాఫ్ యూ... యూ ఆర్ హియర్" అని సరదాగా నవ్వుతూ వెనక్కి తిరక్కుండా అద్దంలోంచే పలకరిస్తూ మోహన్‌ని ఆహ్వానించింది నిర్మల.

"అంటే... తమరు నా గురించా

"సారీ... ఏదో కథ అని చూస్తున్నాను." అని తలెత్తి 'ఏం' అన్నట్టు అద్దంలోంచే చూసింది నిర్మల

"ఇటు తిరగండీ ... ఇంటికొచ్చిన వాళ్ళతో యిలాగేలా వుంది మాట్లాడ్డం... ఏంపర్వాలేదండీ. ఇదుకేనా కబురు పెడదామనుకున్నారు? ఇలా తిరుగరూ. దిష్టిపెట్టనండి."

"అంత విసుగైతే ఎలాగండీ మోహన్‌గారూ... మనిషి మొహంకన్న మర్యాదలమీదే మోజన్నమాట. పేటు తిరిగి కూర్చుంటేనేం. ఒకరి నొకరు చూసుకుంటున్నాం గదా చాలదూ?"

"ఒకరి నొకరు చూసుకుంటున్నాం! ఎలాగ. ఎక్కడా?" అన్నాడాశ్చర్యంగా మోహన్.

"అద్దంలో" అంటూ చిన్న పొడి దగ్గు దగ్గి సిగ్గులు చిగురిస్తూ ఒయ్యారంగా వంగిపోయినవ్వుతుంది నిర్మల. మల్లెమొగ్గల తోరణంలా జిగేల్మని అద్దంలో మెరిసింది పలువరుస. చిత్తైపోయేడు మోహన్.

"నే నెందుకొచ్చేనో తెలుసా?"

"ఎందుకండోయ్?!"

"చాలా సీరియస్ విషయం. కబురు చెప్పిపోదామని."

"ఏమిటండోయ్ అంత సీరియస్. పెళ్ళి కబురా?"

"ఎగ్జాక్ట్లీ — అదే — ఎంత వేగం పోల్చేసుకున్నారూ!"

"ఆం..." అని క్షణం పాటు నిర్ఘాంత పోయింది నిర్మల. వెంటనే తేరుకుని నవ్వుతెచ్చుకుంటూ.

"ఊం... చెప్పండి. ఆగిపోయారేం పూర్తిగా చెప్పండి కబురేదో" అని పుస్తకంలో [illegible] పట్టి పట్టి చూస్తున్నాడు మోహన్. కళవళబడింది నిర్మల.

"పొమ్మా [illegible] లేదీ తక్షణం రారా [illegible] అంటూ మా నాన్న టెలిగ్రాం కొట్టేడు ... నిర్మలగారూ... వెళ్తే ఎదిరించే ధైర్యం నాకు లేదు. మెడవొంచి పీట మీద కూర్చోబెట్టేస్తారు. తప్పించుకోడం నా తరంగాదు. నిర్మలగారూ... నిర్మలా" అంటూ దీనంగా నిర్మలవేపు చేతులు జాపేడు మోహన్.

"ఎంత పుణ్యం చేసుకున్నారు మీరు మోహన్‌గారూ....ఎంత అదృష్టవంతులూ ... ఏ వయసులో జరగవలసిన ముద్దు ముచ్చట్లు ఆ వయసులో జరిగిపోవాలి. సంబరపడి జరిపించడానికింత బలగం వున్నారు మీకు... అంత ఆలోచిస్తారెందుకండీ?!—ఎందుకు తప్పించుకోవాలనుకుంటున్నారూ? పెళ్ళంటే బతుకులో పెద్ద పండుగ మోహన్. ఎంత నికృష్ట జీవితానికైనా ఆ మధుర క్షణం ఒకవరం—శుభం వెళ్ళిరండి కం... గ్రాట్యులేషన్స్ మిస్టర్ మోహన్. వెళ్ళిరండి" అంది నిండుగా తొణక్కుండా.

## రాగ రంజని

# గాన్ సాహెబ్



బడేగులాం అలీఖాన్

చాలా కాలం కిందటి సంగతి. పదిహేనేళ్ళయిందేమో. ఏదో పనిమీద ఎగ్మోరులోని రేడియో స్టేషనుకి వెడితే, అక్కడ పని చేస్తున్న మిత్రులొకరు "మీకు అపూర్వ సంగీతం వినిపిస్తాను. వింటారా?" అన్నారు. "తప్పకుండా!" అన్నాను.

రేడియో స్టేషనులోని రికార్డుల దొంతర్లలోంచి నాలుగైదు రికార్డులు తీసి, ఆయన వాటిని వినిపించారు. అవి ఉస్తాద్

బడే గులాం అలీ ఖాన్ పాటలు.

ఆ పాటలతో అదే నా మొదటి పరిచయం. వాటిని పాటలనాలో, తేనెతేటలనాలో అప్పటికీ, యిప్పటికీ నాకు తెలియదు. నాకు భాష తెలియక పోవటం చేత అవి అర్థం కూడా కాలేదు. "సంగీత జ్ఞానము భక్తి వినా సన్మార్గము కలదా?" అని త్యాగరాజు గారు ప్రశ్నించారు నాకు సంగీత జ్ఞానం, భక్తి రెండూ లేవు కాని సంగీతం అంటే భక్తి మాత్రం వుంది, ఆస్వాదన శక్తి మాత్రం వుంది ఆనాడు నేను విన్నవి ఖాన్‌సాహెబ్ (బడేగులాం అలీఖాన్) ఠుమ్రీలని జ్ఞాపకం వున్నదిగాని, అవి ఏవో ఈనాడు నాకు జ్ఞాపకం రావటంలేదు. అయినా, ఆనాడు నేను పొందిన అనుభూతి మాత్రం నాకింకా గుర్తుంది

కేవలం శబ్దాలు, స్వరాలు ఎంత గారడీ చేయగలవో ఆనాడు నాకు తెలిసింది. "రమ్యాణివీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్..." అన్నాడు మహాకవి కాళిదాసు. మధురమైన సంగీతం వింటుంటే జన్మాంతర స్నేహాలు జ్ఞాపకం వస్తాయట నాకు జన్మాంతర స్నేహాలు జ్ఞాపకం రాలేదుగాని, ఏవో మధుర దృశ్యాలు నా కళ్లముందు రూపుదాల్చాయి. యమునా నది పై వెన్నెల కెరటాలు పొదరిళ్లు, తమాల వృక్షాలు, వేణువూదుతున్న శ్రీకృష్ణుడు, అతని చుట్టూ రాస నృత్యం చేస్తున్న గోపికలు, మధ్యలో ఎక్కడినుంచో కుహూరావమని కూసే ఒక పుంస్కోకిల–

అప్పటికి ఖాన్‌సాహెబ్ పేరు ఉత్తరాదిన ప్రసిద్ధమై వుండవచ్చు గాని, దక్షిణాదివారికి కొత్త అనుకుంటాను అంతకుముందు ఆయన మద్రాసు ఎన్నిసార్లు వచ్చారో నాకు తెలియదు అప్పటికాయన పాకిస్తాన్‌లో వుండేవారట కూడా ఏమైనా, 1959 తరవాత నుంచే ఆయన పేరు దక్షిణాదిన మారుమ్రోగటం ఆరంభించినట్లు గుర్తు. ఉత్తరాదివారికి కర్నాటకం పట్టదు, దక్షిణాది వారికి హిందుస్థానీ అంతగా పట్టదు కాని, ఖాన్‌సాహెబ్ తరచుగా మద్రాసు వచ్చి కచేరీలు చేసి దక్షిణాదివారిని దాదాపు జయించేశారు

ఆ తర్వాత మరి కొద్ది రోజులకే ఖాన్‌సాహెబ్ పాటను ప్రత్యక్షంగా వినడం తటస్థించింది. రసికరంజనిలో అని గుర్తు, ఆయన కచేరిచేశారు ఈ హిందుస్తానీ విద్వాంసుడు ఏ మాత్రం పాడతాడో చూద్దామన్నట్టుగా, ముందు వరసలో దక్షిణాది విద్వాంసులు చాలా మంది కూర్చున్నారు అంతమందిని చూసే కావచ్చును—ఆనాడు ఖాన్‌సాహెబ్ అమృతవర్షం కురిపించేశారు ఆ తర్వాత నేను ఆయన కచ్చేరీలకు చాలాసార్లు వెళ్లాను కాని, ఆనాటి మొదటి అనుభవాన్ని పోలినదాన్ని నేనెప్పుడూ పొందలేదు బహుశా ఖాన్‌సాహెబ్ చేసిన కచేరీలన్నిటిలోకి అదే గొప్పదేమో. దక్షిణాది విద్వాంసులు ఊగిపోయారు. ఆయన ప్రతిభకు అప్రతిభులై పోయారు.

నాకు బాగా తెలియదుగాని శ్రుతికి, అపశ్రుతికి మధ్య ఒక ప్రమాదకరమైన ప్రదేశం వుందనుకుంటాను

# పెద్దవాళ్ల చిన్నతనాలు

పెద్దవాళ్లయినాక మహా మహులనిపించుకున్న వాళ్లలో చాలామంది చిన్నతనంలో ఎందుకూ పనికిరాని మొద్దుల క్రిందే జమకట్టబడే వారట! అందుకే పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్న మాటని దబ్బున నమ్మ బుద్ధి కాదు.

ఇదేదో సినిమాలోని డైలాగులా వుందే అని మీ అభిప్రాయ పడవచ్చు. లేకపోతే చాలా విడ్డూరంగా వుందే అని ఆశ్చర్య పడవచ్చు. కాని, ఏది ఏమైనప్పటికి ఇది మటుకు ముమ్మాటికీ నిజం. కావాలంటే చూడండి ...

అణుయుగానికి నాందీప్రస్తావన గావించిన ఆల్బర్టు ఐన్‌స్టయిన్ తను చిన్నప్పుడు చదువుకున్న మ్యూనిచ్ స్కూలులో ఎప్పుడూ వెనకబడే వుండేవాడట. అపరిమితమైన సిగ్గు, భయంతో ఎవ్వరితోటీ కలియకుండా ఒక మూలంగా కూర్చుని ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుండేవాడు. "ఏమిటీ భగవంతుడా! ఇలాంటి విపరీతపు కొడుకుని ప్రసాదించా"వని అతని తల్లి తండ్రులనుకున్న రోజులుకూడా వున్నాయట!



ఐన్‌స్టయిన్

ఈయనకి చాలా కాలం వరకు మాట్లాడడం, నడవడం రాలేదు "ఎందుకూ పనికి రాడు. పట్టి చవట. ఇతనికి పాఠంచెప్పడం కూడా కంఠశోషతప్ప మరేమీ లాభం లే"దని ఇతని మేస్టరు వసిలేవారు. పాలిటెక్నిక్‌లో జేరుదామని పరీక్షకి వెళ్తే మొదటిసారి తప్పాడు. రెండవసారి ఎలాగో కష్టపడి బొటాబొటి ప్యాసు మార్కులు తెచ్చుకున్నాడు.

[illegible] ఎప్పటి ఐన్‌స్టయిన్ తన ఇరవై ఆరో సంవత్సరానికల్లా

"...యమ్ సిస్టేర్ డ్" అన్న సూత్రాన్ని కనిపెట్టి ప్రపంచ విజ్ఞాన చరిత్రలో ఒక క్రొత్తయుగాన్ని ప్రారంభించాడు. తత్ఫలితంగా నోబుల్ బహుమానాన్ని కూడా పొందాడు.

సరిగ్గా ఇలాగే వుండేవాడట ఐజాక్ న్యూటన్ కూడా! ఎప్పుడూ గాలిపటాలను ఎగరేసుకుంటూ బడి ఎగ్గొట్టి కాలం గడిపేస్తూ వుండేవాడట. అలాంటి న్యూటన్ భూమికి ఆకర్షణ శక్తివుందని మొట్టమొదటిసారిగా గుర్తించి తన వ్యక్తిత్వాన్ని గుర్తింప చేసుకుని పేరు ప్రఖ్యాతులను తన వైపు ఆకర్షించుకున్నాడు.

చార్లెస్ డార్విన్ కూడా ఇంట్లో వాళ్ల చేత ఎందుకూ పనికిరాని దద్దమ్మని అనిపించుకునేవాడు. బడికి పోకుండా అడవుల్లోకి, పొలాలకి పోయి జంతువులని పిట్టలని, పుట్టలని చీమలని చూస్తూ కూర్చునేవాడు. ఇతని మేష్టర్లు ఇలాంటి కుర్ర "న భూతో న భవిష్యత్" అని అనుకుంటూ వుండేవారు. అలాంటి వాళ్ళు కూడా ఇతను తన "ఆరిజిన్ ఆఫ్ స్పీషిస్" సిద్ధాంతంతో తెచ్చుకున్న పేరు ప్రఖ్యాతులు విని అతడేనా ఇతడని ఆశ్చర్యపోయారుట!

రచయితలలో కూడా ఇలాంటి వారికి పరుకు లేక పోలేదు. ఆలివర్ గోల్డ్ స్మిత్ తను చదువుకున్న మూడు కాలేజీలనుండి ఒక్క డిగ్రీ కూడా తీసుకోకుండానే బయటికి వచ్చేశాడు! కట్టుకున్న బట్టలతో యూరప్ అంతా పిల్లనగ్రోవి మీద పాటలు పాడుతూ, మధ్యమధ్యని బిచ్చగాళ్ళకి పాటలు, పద్యాలు రాసి పెడ్తూ, తిన్నప్పుడు తిని లేనప్పుడు పస్తుండి పర్యటించాడు. ఆల్ప్స్ పర్వతాలమీద కూర్చుని తన పర్యటనానుభవాన్ని "ట్రావెలర్" అనే కావ్యంలో రమ్యంగా వర్ణిస్తూ రాశాడు.

రోమన్ సామ్రాజ్య చరిత్ర వ్రాసిన గిబ్బన్ కూడా చదువుకునే రోజుల్లో బుద్ధావతారంగానే వుండేవాడు! ఇప్పటికీ ఎప్పటికీ పాఠకులను సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తించేసేటటువంటి లెక్కలేనన్ని నవలలు వ్రాసిన సర్ వాల్టర్ స్కాట్ కోసమేనా "మూర్ఖాగ్రేసర చక్రవర్తి", అన్న బిరుదుని సృష్టిస్తారని అతని చిన్నప్పుడు అనుకునే వారట! ఆంగ్లకవి థామస్ ఛాటర్టన్ కూడా మందగొడిగానే వుండేవాడుట. ఇలాంటి కుర్రాళ్ళు వుంటే స్కూలుకి కూడా అప్రతిష్ఠ అని అతనిని డిస్మిస్ చేసేశారు కూడా. ఇటీవలి వాడయిన ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త కీన్సుని – అదే ఆర్థిక శాస్త్రంలో పట్టి తెలివి తక్కువవాడని చిన్నప్పుడు అంతా అనుకునే వారుట. సివిల్ సర్వీస్ పరీక్షలో అతనికి వచ్చినన్ని తక్కువ మార్కులు అంతకు ముందుగాని, తర్వాతగాని ఎవ్వరికీ రాలేదుట! అలాగ ఒక వింత రికార్డు స్థాపించాడు లార్డ్ కీన్సు.

—ఆసుర్తి రామప్రసాద్

# తీరని వేతలో తీయని గాథలు

సి. ఆనందారామం

(గత సంచిక తరువాయి)

"సరేలే సరళక్కా!"

కృష్ణ అంత తేలిగ్గా ఒప్పేసుకుంటుందని సరళ ఆశించలేదు. ఉప్పొంగిపోయింది.

'నీదెంత మంచి మనసు కృష్ణా!' మనసారా అంది.

"పోదూ! నాదేముంది? నీ ఇల్లు నీ ఇష్టం..." నవ్వేసింది కృష్ణ-

హుషారుగా వంటంతా చకచక ముగించింది సరళ. సరళ మనసు స్వర్గసీమలో విహరిస్తోంది. ఇంత సులువైన మార్గం కళ్ళ ముందుంచుకొని ఇన్నాళ్ళూ అన్ని తిప్పలు పడినందుకు నవ్వుకొంది.

వడ్డనల సమయానికి వంటింట్లోకొచ్చింది కృష్ణవేణి

"వంటంతా అయిందా సరళక్కా!"

"ఆ! అయిపోయింది కృష్ణా! రుచి చూడు?"

కృష్ణ ఒక్కొక్కటీ రుచిచూసింది.

"ఎంతబాగా చేశావ్ సరళక్కా! నిజం చెప్పేసుకుంటున్నాను. నాకు కూడా ఇంత బాగా రాదు"

'ఊరికే అంటున్నావు. నువ్వు కూడా బాగానే వండుతావు.'

"ఊరికే కాదక్కా-నిజంగా! సరేలే నువ్వు నీ గదిలోకెళ్ళి డ్రెస్ చేసుకో ఇంక-బావొచ్చే టైమయింది"

"అదేమిటి? నేనే వడ్డిస్తాను"

"అమ్మో! ఇంకేమైనా ఉందా? బావ నిన్నూ నన్నూ కూడా తవ్వి పాతేస్తాడు. బావొచ్చేసరికి నువ్వు డ్రెస్ చేసుకుంటూ కనిపించాల్సిందే! లేకపోతే బ్రతగలనా?"

సరళ ముఖం తెలతెల పోయింది.

"అంటే, వంటంతా నేను చేసినట్లు ఆయనకు తెలియకూడదనా?"

'అంతే మరి!'

"వీల్లేదు- నేనొప్పుకోను. నేను నిజం చెప్పేస్తాను"

"చెప్పు-బావ నీమాట నమ్మడు. నేను వంటింట్లోనే ఉంటానుగా!

**సీరియల్**

నేనే చేశాననుకుంటాడు. నువ్వనవ సరంగా వ్రాయకపోవటం మాను కున్నావని నీమీద చిరాకు పడ తాడు."

"కృష్ణా! ఇది న్యాయంకాదు. ఏవ్వంత క్షోభ పెట్టకు. నిన్ను దేవుడు క్షమించడు."

"ఇదెక్కడ న్యాయం! కూర్చొ బెట్టి చేసి పెడుతూంటే క్షోభా? దేవుడు నన్ను క్షమించడూ? పోనీలే! దేవుడు నన్ను క్షమించకపోతే నాకు బాధలేదు. బావకి కోపం రాకుండా ఉంటేచాలు."

"ఛా! నువ్వూ ఒక ఆడదానివేనా? ఎందుకొచ్చిన జన్మ?"

"సరళక్కా! మాటలుజాగ్రత్తగా రానీయ్! ఎందుకమ్మా అంత లేని మాటలు? అంతకూడని పని ఏం చేశాన్నేను? ముందు ఒకళ్ళని పెళ్ళి చేసుకోవాలనుకున్నానా? వాళ్ళనా రచనలు బాగులేవన్నారని కోపం తెచ్చుకున్నానా? మరొకళ్ళు నా రచనలు బాగున్నాయన్నారని ఆమాంతం వరించేశానా? మూడుముళ్ళూపడకుండానే పరపురుషుడు ముక్కచెక్కలయితే నీకూ, నీకూ చాకిరీ చేసుకుంటూ పొట్ట కుంటున్నాను. ఆంత మాత్రానికి నోటికొచ్చిన మాటలన్నీ అంటున్నావా?"

క్రింద కూలబడి వెక్కి వెక్కి ఏడవసాగింది కృష్ణవేణి.

సరళకు గొంతుకతడారిపోయింది.

సరళకూ రావుకూఉన్న పూర్వ పరిచయం సుదర్శనానికి తెలును. సరళే చెప్పింది. తరువాత తరువాత ఏ అపార్థాలూ రాకుండా ఉండటానికి అన్ని సంగతులూవివరంగా చెప్పి అతని క్షమయితేనే

# జరిగిన కథ

సరళ పేరు పొందిన రచయిత్రి. సాహిత్యాభిరుచి కలిగిన రావును ఆమె ప్రేమించింది. కాని అతనికి ఆమెపట్ల రచయిత్రిగా పెద్ద గౌరవంలేదు. అతని విమర్శలకు ఆమె అహం దెబ్బతింటుంది. రావుమీద కసి తీర్చుకొనడానికి సుదర్శనాన్ని పెళ్ళి చేసుకుంటుంది సుదర్శనం ఆమెను స్త్రీగా కాక రచయిత్రిగానే చూస్తాడు పట్టిసకలం విడవనివ్వడు ఏ పని ముట్టుకోనివ్వడు. ఇంట్లోంచి కదలనివ్వడు. ఎప్పుడూ ఏదో రాస్తూ వుండాలంటాడు. ఇంటిలో పని చేయడానికి అందగత్తె కృష్ణవేణి వుంది. ఆమె, తన భర్త చనువుగా వుండడంచూసి సరళ మనస్సు మండిపోతూ వుంటుంది. రాను రాను జీవితమే దుర్భర మవుతుంది.



రావుతో మాట్లాడతానని లేకపోతే, మానేస్తానని చెప్పింది.

ఈ విషయం విన్న సుదర్శనం కష్టపెట్టుకోలేదు సరికదా, సరళ రావుని మానేసి తనను చేసుకున్నందుకు గొప్పగా ఫీలయ్యాడు. పైగా ఈ కథను తనే గొప్పగా చాలా మందికి చెప్పుకున్నాడు. పాపం. సరళ రహస్యం పూర్తిగా రచ్చకెక్కేసింది. ఏం చెయ్యగలదు? కాగితాలమాటునకరువుతీరాఏడ్చింది.

## 13

"సరళా! మీ అన్నయ్య దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చింది."

"ఏం వ్రాశాడు?"

"పావం, వాళ్ళమ్మాయి

ఇందూకు జ్వరంగా ఉందిట. ఒక్క దికీ అవస్తగా ఉందిట - నిన్నొచ్చి నాలుగురోజులుండమని రాశాడు. ఏం, వెళ్తావా ?"

పాపం, ఇందు చిన్న పిల్లగా ఉండగానే సరళ వదిన చచ్చిపోయింది. అన్న శ్రీరాం నానా యాతనా పడి ఇందును పెంచు కొస్తున్నాడు వెళ్ళాలనే ఉంది కానీ తను వెళ్తే - కృష్ణ - సుదర్శనం ఇద్దరే యింట్లో! - అబ్బా ఊహించటానికే మంటగా ఉంది.

"నేను - నేను - వెళ్ళలేను—"

వణుకుతున్న గొంతుకతో అంది సరళ.

"వెళ్ళవా? అదేం? ఆశ్చర్యంగా అడిగాడు.

ఏం చెవుతుందీ! ఏం చెప్పాలి?

"మీరు వస్తారా ?"

"ఎలా? నాకు సెలవులేదు. నువ్వొక్కదానివే వెళ్ళడానికేం ?"

"ఉహు! వెళ్ళను."

"బాగుంటుందా ? ఒక్క సారి వెళ్లి రద్దూ !"

"ఒక నవల మధ్యలో ఉన్నాను. వదలి వెళ్ళలేను" - సుదర్శనం నోరు కట్టుబడి పోయే సమాధానం చెప్పింది.

"పోనీ, నే వెళ్తాను. పాపం, ఎంతపసరమో, ఏమిటో ?"

వింటున్న కృష్ణ చటుక్కున అంది.

సరళ మనసు ఆనందంతో చిందులు వేసింది. ఎంత కృష్టం! కనీసం కొన్నాళ్ళపాటు ఇంట్లో తను తన భర్తా - హమ్మయ్య!!

"అంతకంటేనా కృష్ణా! నువ్వెళ్ళు! నీ మేలు మరచి పోలేను."

"ఇందులో ఏ వుందిలే సరళక్కా కాస్తంత గంపంత చేస్తావు—"

నవ్వేసి వెళ్లిపోయింది కృష్ణ—

ఆ మరునాడు శ్రద్ధగా వ్రాసుకుంటున్న సరళ దగ్గర కొచ్చాడు సుదర్శనం—

"ప్చ్! బోలెడు డబ్బు నష్టం - పోనీలే? నీరచనల కన్నా నా ఏవిటి ?"

విచిత్రంగా చూసింది సరళ—

"డబ్బు నష్టమేవిటి ?"

"సెలవు లేదు. సెలవు పెత్తే జీతం నష్టం మీదే పెట్టాలి."

సరళకు సంతోషంతో వళ్ళు తెలీలేదు.

తనొక్కర్తి ఉంటుందని సెలవు పెడుతున్నాడు సుదర్శనం.

"పోతే పోయింది లెస్తురూ! ఇంతకూ మీరు సెలవు పెట్టున్నారా ?"

"పెట్టేశాను. వారం రోజులు!"

"వారంరోజులే! ఏడురోజులు!!"

ప్రొఫెసరు క్లాసులో పాఠం చెబుతూ 'స్త్రీకి, పురుషుడికి ఒక ప్రధానమైన భేదం వుంది' అన్నాడు

వెంటనే ఒక విద్యార్థి ఉండనివ్వండి!' అన్నాడు.

'అవును. కనీసం వారమయినా ఉండకపోతే బాగుండదు—'

'ఉండటమేమిటి?'

'అదే, మీ అన్నయ్య దగ్గర!'

'మా అన్నయ్యదగ్గరా?'

'అవును నువ్వు వెళ్ళక నేనూ వెళ్ళకపోతే ఏం బాగుంటుంది? ఏమైనా అనుకోరూ! అందుకే చచ్చినట్లు సెలవు పెట్టాను. పోనీలే నీ రచన అన్నింటికంటె ముఖ్యం నాకు. సుఖంగా వ్రాసుకో! అసలు డిస్టర్బెన్స్ ఉండదుగనుక ఈ వారంలో నీనవల పూర్తి పోవచ్చు—అనవసరంగా వటాఅదీ పెట్టుకోకు హోటల్ నుంచి కేరియర్ తేవటానికి కుర్రాణ్ణి మాట్లాడాను మంచి హోటలేలే! భోజనం బాగానే ఉంటుంది కాఫీ, టిఫిన్ కూడా వాడే తెస్తాడు రాత్రిళ్ళు సాయం పడుకోవటానికి మన పక్కింటి బామ్మగారొస్తానన్నారు. మా వెంకట్రావు కనిపెట్టి చూస్తానన్నాడు. నిశ్చింతగా వ్రాసుకో! నీ రచనా వ్యాసంగానికి సహకరించటమే నా ఆశయం – అందుకోసం ఎంత త్యాగమైనా చేస్తాను. ఎంతైనా కష్టపడతాను'

గుడప్పగించి చూస్తూకూర్చుండిపోయింది సరళ—

# 14

వారం రోజులుగ్గట్టుకు ఉంది సరళ. వారం గిర్రున తిరిగింది కృష్ణవేణీ సుదర్శనాలు రాలేదు. ఇంత నిగ్రహించుకోలేక సరళకూడా అన్నదగ్గరికి బయలు దేరింది.

చిరునవ్వుతో ఎదురొచ్చిన శంకు నెత్తుకుని 'జ్వరం తగ్గిపోయిందా?' అంది

'జ్వరానికేంలే! నీరచన పూర్తయిందా?' సస్తారంగా అడిగాడు శ్రీరాం

'చెప్తా కానిమీబావగారెక్కడ?'

'బావగారు, కృష్ణా ఇవాళ తెల్లవారుఝామున వెళ్ళిపోయారు.'

'ఆ!'

కుర్చీలో కూలబడి ది సరళ.

'నిన్న రాత్రే బయలుదేరారు. కృష్ణను వెళ్ళనివ్వలేదు. అందుకని వాళ అది నిద్రపోతుండగా బయలు దేరి వెళ్ళి

మాట్లాడలేక పోయింది సరళ.

"ఇందుకు జ్వరంగా ఉందని రాస్తే కూడా నీకు నీ రచనలే ముఖ్యమయ్యాయి కదూ!"

"కాదన్నయ్యా! రచనలు కాదు! నా ప్రాణాలన్నీ ఇందు మీదే ఉన్నాయి. కానీ రాలేక పోయాను."

"సుదర్శనం నువ్వు రాసుకోటానికి ఆగిపోయావన్నాడు! మరెందుకు?"

"అది - ఆ నక్క కారణం"

"నక్కా?!"

"అవును. గుంటనక్క - దాని మూలంగా ఆగిపోయాను."

"నువ్వు నక్కలని పెంచు




తున్నావా? నీ రచనలకి అవి అవసరమా?" తెల్లబోతూ అడిగాడు శ్రీరాం

"నేను పెంచటం లేదు. అదే పెరుగుతోంది. నక్కంటే మామూలు నక్క కాదు. కృష్ణవేణి..."

"కృష్ణవేణి! కృష్ణవేణిని నక్క అంటున్నావా? నక్కకు కృష్ణకూ ఎక్కడా పోలికల్లేవే! కృష్ణ చాలా అందంగా ఉంటుంది కదూ."

"హు! అందం! బోడందం! దాని మనసు గురించి చెపుతున్నాను. దాని బుద్ధులను గురించి చెప్తున్నాను"

"చాలా అన్యాయం సరళా! కృష్ణ పితంతువైనంత మాత్రాన అందాన్ని బోడందం అనకు. నిజానికి అందానికి 'బోడి' తనం ఉంటుందా ఎక్కడైనా? నువ్వు రచయిత్రివి, నీకన్నీ ఉన్నవి, లేనివి కనిపిస్తాయి."

"లేనివి కావు. ఉన్నవి అన్నీ ఉన్నవే చెపుతున్నాను. మాయావి, కులటు... ఛండాలి... దరిద్రగొట్టు... శని..."

"అప్!"

గర్జించాడు శ్రీరాం.

హఠాత్తుగా ఆగిపోయింది సరళ.

"ఏమిటీ?"

"కృష్ణనేమీ అనకు."

"ఇదేమిటీ?"

"నేను కృష్ణను ప్రేమించాను."

"ఏమిటి? నువ్వు... భగవాన్! విన్నూ వలలో వేసుకుందా?"

"విన్నూ—అంటే?"

"మా అయన్ని ఏనాడో వల్లో వేసుకుని పిచ్చికుక్కలా ఆడిస్తోంది. ఆయనకు కృష్ణే లోకం..."

మాట్లాడుతూ మాట్లాడుతూ, మధ్యలో చటుక్కున ఆగిపోయింది సరళ.

ఇదీ బాగానే ఉంది. తన అన్న చాలా మంచివాడు. ప్రేమ వేరూ పెళ్ళి వేరూ రకం కాదు. అన్న కృష్ణను ప్రేమించి పెళ్ళి చేసుకుంటే తనకు కృష్ణ బెడద తప్పుతుంది

"అయితే అన్నయ్యా! నువ్వు కృష్ణను పెళ్ళి చేసుకుంటావా?"

"ఇంతక్రితం క్షణం వరకూ చేసుకుందామనే ఉద్దేశంలోనే ఉన్నాను. కృష్ణ కూడా ఒప్పుకుంది. ఇందు నెంతో ప్రేమగా చూసింది. కృష్ణ సవర్యవలే ఇందుకింత త్వరలో నయమయింది. క్షణాల్లో ఇంటిమనిషిలా కలిసి పోయింది. ఎంతో సుఖపడేసింది. పెళ్ళి చేసుకుందామనుకున్నాము కృష్ణ ఒప్పుకునే సరికి ఎంతో అదృష్టవంతుణ్ణనుకున్నా. గినిపోయాను. హు! ఆ అదృష్టం నాకు దక్కే యోగంలేదు."

"అదేవన్నయ్యా! ఇద్దరికీ ఇష్టమయినప్పుడు హాయిగా పెళ్ళిచేసేసుకోండి."

"ఎలా? నువ్వే చెప్తున్నావుగా!




మీ ఆయనా, కృష్ణా ప్రేమించుకున్నారని. నేనెలా చేసుకోనూ? సుదర్శనం అదృష్టవంతుడు!" ఈర్ష్యగా నిట్టూర్చాడు శ్రీరాం! సరళ అదృష్టం సరళలోని రచయిత్రిని చూసి పకాలు మంది.

# 15

సరళ ప్రాణానికి మూలిగే నక్క మీద తాటిపండులా వచ్చాడు కృష్ణ అన్నయ్య. ఉసూరుమంది సరళ. అన్నకి చెల్లెల్లో లోపాలు కనిపిస్తాయా? అన్నగారి అండదండలు కూడా లభిస్తే ఇక కృష్ణను అడ్డేదెవరు?

కానీ, కృష్ణ అన్నయ్య కృష్ణ ధోరణికి మద్దతునియ్యకపోగా, కటువుగా లాడసాగాడు.

"ఆ దేవిటి కృష్ణా! ఇంట్లో ఇల్లాలుండగా ఇలా ఇల్లంతా నీ నెత్తిన వేసుకోవటం నాకేం నచ్చలేదు అది మర్యాదగానూ ఉండదు."

సరళకు చెవుల్లో పన్నీరు చిలకరించి నట్లయింది. హమ్మయ్య!

ఇన్నాళ్ళకి ఒక్కడయినా శాస్త్ర జ్ఞానం ఉన్న మనిషి కనిపిస్తున్నాడు తన కళనయినా విముక్తి కలిగితే బాగుండును.

'ఏం చెయ్యమన్నావ్! ఆవిడ రచయిత్రి ఎప్పుడూ !వానుకుంటూ ఉంటుంది. ఊరికే వాగ్ఛనిమాత్రం ఏం చెయ్యాలని ఇంటి పనంతా నేనే నెత్తి నేసుకున్నాను.'

'కానీ, ఇలా ఎన్నాళ్ళు? ఎవరైనా ఉదారులు నిన్ను పెళ్ళి చేసుకుంటే, ఒక ఇంటి దానివయితే అందరికీ సంతోషమే! లేకపోతే, నా దగ్గరయినా వచ్చెయ్యి. కానీ, ఇలా పరాయి ఇళ్ళల్లో ఉండటం ఏం మర్యాదగా ఉంటుంది?'

సరళ పులకించి పోయింది. చెవులు రిక్కించి వింది. సమాధానం కోసం — ఏ సమాధానమూ వినిపించలేదు. ఆతను ఏముఖం పెట్టుకు చెపుతుంది? ఈ అన్నయ్య కృష్ణను తీసికెళ్ళిపోతే బాగుండును. తీసికెళ్ళి పోయేలాగనే ఉన్నాడు.

"క్షమించండి. మీరాత కాటంకం కలిగించినట్లున్నాను—"

సరళ గదిలోకొచ్చాడు కృష్ణ అన్నయ్య.

"అబ్బెబ్బె! ఏం లేదు రండి. కూర్చోండి" ఆప్యాయంగా ఆహ్వానించింది సరళ, ప్రస్తుతం అతనంటే మంచి గౌరవభావం కలిగింది సరళలో.

'మీరు అన్నీ తెలిసినవారు, తెలివైనవారు కృష్ణ విషయం మీతో మాట్లాడదామని వచ్చాను,"

సరళ పొంగి పోయింది.

---

'ఆహా ! మీ అందరికంటె తెలివైన దాన్నా ఏమిటి ? ఏదో అభిమానం కొద్దీ అలా అంటున్నారు."

"అలా అనకండి. చిన్నవారైనా మెచ్చుకోక తప్పదు. మీ రచనలు చదువుతూంటే తెలియదూ మీరెంత తెలివైన వారో ?

"మీరు నా రచనలన్నీ చదివారా ?"

"ఆ ! అన్నీ చదివానండీ : కానీ పేర్లు గుర్తు లేవండీ ! నా జ్ఞాపకశక్తి అంత గొప్పది ఏమీ కాదు" ఏదేం చదివారని సరళ అడుగుతుందేమోనని భయపడి ముందుగానే చెప్పేశాడు. ప్రస్తుతం సరళ మనసు తన రచనల మీద ఉండి ఉంటే గాభరాపడి ఉండేది. కానీ, ఆవిడ మనసంతా కృష్ణమీద ఉంది. కృష్ణనెలాగైనా పంపేసే ఆలోచన మీదుంది.

"కృష్ణను గురించి మాట్లాడతానన్నారు."

"ఆ ! అదే చూడండి .... కృష్ణ మీలాంటి రచయిత్రికి సహాయపడటం నాకు సంతోషంగానే ఉంది."

భగవాన్ :

"కాని ?

ఏమిటో ?

"ఇలా ఒకరింట్లో ఇంటి మనిషిలా ఉండిపోవటం వయసులో ఉన్న ఆడపిల్లకు మర్యాదేనంటారా ?"

"మర్యాదని ఎలా అనగలమండీ !"

"అవును కదా, ఎన్నాళ్ళని ఇలా ?"

"అవునులెండి, ఇలా ఎల్లకాలం సాగదు."

"అందుకే కృష్ణను నాతో తీసికెళ్ళిపోదామనుకుంటున్నాను."

దర్జాగా తన చెల్లెల్ని తను తీసికెళ్ళక మధ్యలో తన సలహా అడుగుతాడేమిటీ ? వెంటనే తీసుకుపొమ్మంటే బాగుంటుందా ? ఎలాగూ తీసుకుపోతున్నాడు. మర్యాదకు రెండు రోజులాగమంటేనేం ?

"కృష్ణ లేకపోతే మాకు చాలా కష్టమేననుకోండి. అయినా మీరు తీసికెళ్తానంటున్నప్పుడు నేనెలా కాదనగలను ? పోనీ రెండురోజులాగి వెళ్ళండి."

మనసులో మధనపడుతూ వే అంది.

"రెండు రోజులాగమంటున్నారా ? మీమాట కాదనలేను. కానీ రెండు రోజులుంటే ఏం లాభం ? ఎల్లకాలం మీదగ్గిరే ఉంచుకోండి"

"అంటే ?" వెలవెల పోతూ అంది సరళ.

"మీరొప్పుకుంటే నువ్వు దర్శనం కృష్ణను కూడా చేసుకోవచ్చు. అప్పుడు మీరింకా సుఖంగా నిశ్చింతగా వ్రాసుకోవచ్చు. ఏమంటారు ?"

సరళ గొంతు తడారిపోయింది. ఏమంటుందీ ?

"నన్ను బలి ఇస్తావా ?" అని మేకపోతు అడిగితే ఏమంటుంది ?

"మీరు వాళ్ళ ఉద్దేశం తెలుసుకునే చెప్తున్నారా?"

"అయ్యో! మీరు చూస్తున్నారుగా ఇంకా తెలిసే దేమిటి? ఆ మూడు ముళ్ళూ పడకుండా ఏ అఘాయిత్యాలు జరుగుతాయోనని హడలిచస్తున్నాను."

అదిరి పడింది సరళ. ఒక్కసారి చైతన్యమంతా నశించి పోయినట్లయింది

తన భర్తకు తనమీద ప్రేమ లేక పోయాక ఎంతవరకు కట్టేసి ఉంచుకో గలదు? పోనియ్యి: వాళ్ళిద్దరినీ పెళ్ళి చేసుకోనీ! వాళ్ళనైనా సుఖపడనీ. తనగతి? రావు! అవును పారిపోవాలి. తన రావు దగ్గరకి పారిపోవాలి. ఇంక ఈ క్షోభ భరించలేదు.

"ఆయనకు కూడా ఇష్టమయితే నాకేమీ అభ్యంతరం లేదు."

తెల్లబోయాడు కృష్ణ అన్నయ్య-

"ఒప్పుకుంటున్నారా?"

"ఆ! ఒప్పుకుంటున్నాను వాళ్ళిద్దరినీ పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండమనండి."

తెలతెలబోతూ గదిలోంచి ఇవతలికొచ్చాడు కృష్ణ అన్నయ్య - వెంటనే తన బట్టలు సర్దుకుని ఒక రిక్షాను పిలిపించి రావు ఎడ్రసిచ్చి, అందులో కూలబడింది సరళ.

## 16

"సరళా! నువ్వు.. నువ్వు... ఇక్కడికి కొచ్చావా? ఎంతపని చేశావ్ సరళా! నన్ను కలుసుకోవద్దని చెప్పాగా? ఎందుకొచ్చిన అపార్థాలు చెప్పు? లేనిపోని చిక్కులు సృష్టించుకోవటం దేనికి?"

తలవని తలంపుగా తన ఇంటి కొచ్చిన సరళను చూసి గాభరా ఆందోళన, విసుగు అన్నీ కలిపేసిన స్వరంతో అన్నాడు రావు

"అర్థాలూ లేవు. అపార్థాలు లేవు. నేనొచ్చేశాను."

"అంటే?"

"ఏకంగా శాశ్వతంగా వచ్చేశాను. నీ దగ్గరుందామని వచ్చాను. ఇంక నేను నీదాన్నే రావ్!"

పాలిపోయిన ముఖంతో, రేగిపోయిన జుట్టుతో, వణుకుతున్న పెదవులతో శూన్యంలోకి చూస్తున్న చూపులతో ప్రేమ హారాలు వల్లిస్తున్న సరళను చూసేసరికి మతిపోయింది రావుకి.

"నీ వంట్లో ఎలా ఉంది సరళా?"

"వంట్లోనా? వంట్లోకేం? అప్పుడే చావను."

"ఇప్పుడే వస్తాను—"

వీధిలోకి పరుగెత్తాడు రావు. ఒక అరగంటలో ఒక లేడీడాక్టర్‌తో సహా టాక్సీలోంచి దిగాడు.

లేడీ డాక్టర్ సరళను సమీపించి గబగబ నాడి చూడ సాగింది.

సరళ బిత్తరపోతూ "ఇదేమిటి?" అంది.

"హుష్! మాట్లాడకు – విశ్రాంతి తీసుకో! ఇప్పుడు నీకు విశ్రాంతి అవసరం!"

"నాకసలు జబ్బు లేందే!"

లేడీ డాక్టర్ రావు వంక చూసింది. రావు నిస్సహాయంగా జాలిగా చూశాడు—

"అయితే, మీ అన్నయ్య చెప్పింది నిజమే నన్నమాట!"

"మా అన్నయ్యెవరు?"

"మిస్టర్ రావు!"

కెవ్వున అరిచింది సరళ. రావు గాభరాగా సరళను పట్టుకున్నాడు.

"డాక్టర్! ఈవిడ రచయిత్రి. చాలా చక్కగా రాస్తుంది కానీ, విపరీతంగా అదేపనిగా ఆలోచించి ఆలోచించి, ఇలా తయారయింది" డాక్టర్ జాలిగా సరళ వంక చూసింది. సరళ శూన్యంగా రావు వంక చూసింది. రావు తపతలి కెళ్ళమని సైగచేసి డాక్టర్ సరళను పరీక్ష ప్రారంభించింది.

"వద్దు డాక్టర్! నాకే రోగమూ లేదు. రావు మాటలు నిజంకాదు—"

---

చాలా ఏళ్ళుగా సెలవు పెట్టకుండా కష్టపడి పనిచేస్తున్న గుమాస్తా ఒకరోజున తెగించి మేనేజర్ని అడిగేశాడు - తను విశ్రాంతి తీసుకోదలచానని, నెలరోజులు సెలవు కావాలని.

"నెలరోజులకి? ఏం చేస్తావ్ నెలరోజులు?" అని మేనేజరు చిరాగ్గా అడిగాడు.

"మా యింట్లో ఊగే పడకుర్చీ ఒకటుందండి ఒక పదిహేను రోజులు దాంట్లో కదలకుండా కూచ్చుంటానండి. తరవాత నెమ్మదిగా ఊగటం మొదలెడతానండి" అని గుమాస్తా సమాధానం.

# ఆహారం

## పొదుపు చేయవలసిన సమయమిదే

### ఎందుకు?

లక్షలకొద్దీ ప్రజలు క్షామ బాధితులై వున్నారు. క్లిష్టమైన నెలలు ముందున్నాయి గనుక ఆహారం దాచుకోవాలి. ఆహార సమస్యను ఎదుర్కొనటానికి ఖర్చు తగ్గించాలి.

### ఏవిధంగా?

అతి వ్యయముతో కూడిన విందులు, వినోదాలు మానెయ్యండి. అతిథి పరిమిత చట్టాన్ని పాటించండి. కాయధాన్యాల, పప్పుధాన్యాల వంటకాలకు కూడ హద్దులు పాటించండి. కాయధాన్యాలు సాధ్యమైనంత తక్కువగా వినియోగించండి.

ప్రై17

**ఆహారం పొదుపు చెయ్యటమంటే ఆదా చెయ్యటమే**

జో. తి.

"రావు అబద్ధాలాడడు."

"మీకు తెలియదు డాక్టర్! అతను ."

"అసలు నాకు తెలియక పోవటమేమిటి? త్వరలో మేం పెళ్ళి చేసుకోబోతున్నాం!"

"ఏమిటీ?"

"ఎందుకంత ఆశ్చర్యపోతావ్! డాక్టర్ ఏమనుకొన్నారు? మనసులు కలిసినప్పుడు ఈ వ్యత్యాసాలు అడ్డరావు."

"మీరు కూడా లిటరేచర్‌లో అసక్తి ఉందా? రావు విమర్శలంటే మీకు ఇష్టమేనా?"

"నాకసలు లిటరేచర్‌లో ఆసక్తి లేదు. నవలలనే కోరికా లేదు. చదివే టైమూ తిరికా లేదు. రావు సాహిత్య విమర్శలు చేస్తాడా? నాకు తెలీదు."

"అయితే, మీరెందుకు పెళ్ళి చేసుకుంటున్నారు?"

పకాలున నవ్వింది డాక్టర్—

"ఇన్నేళ్ళొచ్చి ఇదేం ప్రశ్న? అతను నాకు నచ్చాడు. అతనితో జీవితం బాగుంటుందని అనుకున్నాను. పెళ్ళి చేసుకుంటున్నాను."

తేష్టబుడిగిన సరళ ఈసారి డాక్టర్ పరీక్షలకు అడ్డు చెప్పలేదు.

"అదీ సంగతి! ఈ స్థితిలో ఇలాంటి మెంటల్ డిస్టర్బెన్స్ ప్రమాదం! ఛ! ఇలాంటప్పుడైనా రెస్ట్ తీసుకోక ఆ రాత లేమిటి?"

వినుకొన్నది డాక్టర్—

"ఏ స్థితి?" తెల్లబోతూ అడిగింది సరళ.

"నీకు మూడోనెలని నీకు తెలియదా? చదువుకున్న దానివి." అంతకంటె తెల్లబోయింది డాక్టర్.

సరళకు ఊపిరాగిపోయింది. అవును. ఈ చికాకుల్లోపడి గమనించుకోలేదు. అవును. తనకు మూడో నెల!

"చెడ్డభార్య ఉంటారు. కానీ చెడ్డ తల్లులుండరు" ఎక్కడో చదివింది. అయ్యో! తనెంత నైచ్యానికి దిగజారిపోయింది? తనను తనేం చేసుకున్నా పాపముందా?

డాక్టర్ద్వారా సంగతి తెలిసి హుషారుగా లోపలికొచ్చాడు రావు.

"కంగ్రాట్యులేషన్స్ సరళా! నాకు చాలా సంతోషంగా ఉంది. నామాట విను. నీకారచనలు మరికొన్నాళ్ళు విశ్రాంతి తీసుకో! ఆలోచించకు."

"వెళ్తాను" తూలుతూ లేచింది సరళ.

"నో! నో! మీరు రిక్షాలో వెళ్ళద్దు టాక్సీని పిలుద్దాం. టాక్సీని పిలు రావ్!"

లేవబోతున్న సరళను కూచోబెట్టేసింది డాక్టర్.

రావు క్షణాలమీద టాక్సీని తీసుకొచ్చాడు. టాక్సీలో కూలబడి.రావుకూ డాక్టరుకూ నమస్కారం చేసింది. ఇద్దరూ చేతు లూపారు.

టాక్సీ కదిలింది. టాక్సీవాడు ఎగ్ర వడిగాడు

గుండె ఝల్లుమంది సరళకు.

ఎక్కడికెళ్ళాలి తను ? ఈ లోకంలో తనకు స్థానమెక్కడుంది ? సుదర్శనం భార్యగా కృష్ణవేణి అర్థాంగిగా వాళ్ళిద్దరి మధ్యకి తను వెళ్ళకూడదు ఇక జీవితాంతమూ తన అన్న దగ్గిర ఇందును చూసుకుంటూ గడుపుతుంది.

టాక్సీ వాడితో స్టేషనకు పోనియ్యమని చెప్పింది.

# 17

రిక్షాదిగి శ్రీరాం గుమ్మంలో అడుగు పెట్టిన సరళ ఎదురుగా నిల్చున్న కృష్ణవేణిని చూసి కొయ్యబొమ్మయి పోయింది

సరళను చూసిన కొన్ని క్షణాలు విభ్రాంత పోయిన కృష్ణ వెంటనే రుద్రకాళిలా సరళమీద ఎరుచుకు పడింది

"సరళక్కా ! నిన్ను తప్పించుకోటానికి ఇంతదూరం పారిపోయొచ్చాను. ఇక్కడి కొక్కడా తయారయ్యావా ? ఇక ఈ జన్మంతా, నీ బాధ నాకు తప్పదా ?"

సందడికి లోపలి గదిలో ఉన్న శ్రీరాంకూడా హాల్లో కొచ్చాడు. సరళను చూసి తెల్లబోయాడు.

"సరళా ! నీకిది న్యాయం కాదు. నేను ప్రఖ్యాత రచయిత్రివయితే నాకు సంతోషమే కావచ్చు, అందుకోసం అమాయకురాలి సుఖ సంతోషాలను నువ్వు బలి తీసుకోవడం నేను సహించలేను" కళ్ళు తిరిగి పోతుండగా కుర్చీలో కూలబడింది సరళ.

"మంచినీళ్ళు" అంది.

కృష్ణకాని, శ్రీరాంకాని వినిపించుకునేలా లేరు ఇందు తెచ్చిచ్చింది ఆ నీళ్ళు తాగేసి రుమాలుతో ముఖం తుడుచుకుంది.

"ఏమిటి మాట్లాడుతున్నారు మీరు ?" అంది పూడుకు పోతున్న గొంతుకతో.

"నేను చచ్చినా మీ ఇంటికిరాను" అంది కృష్ణ రొప్పుతూ.

"నా కంఠంలో ప్రాణం ఉండగా పంపను" అవలు కొట్టాడు శ్రీరాం.

"భగవంతుడా !"

సరళ ఏడ్చేసింది.

"ఏడవకు సరళక్కా ! పోనీ వస్తానులే !" కృష్ణ కరిగిపోయింది.

"వీల్లేదు కృష్ణా ! వీల్లేదు. ఏడుస్తే ఏకవనీ ! కాస్సేపేడ్చి మరో మంచి నవల రాసేస్తుంది. నువ్వెళ్ళకు. నేవెళ్ళనివ్వను. నువ్వెళ్ళిపోతే నాకొట్టే ఏడుపే మిగులుతుంది రచనలు నాకు రావు."

సరళ ఉద్రేకంగా లేచింది.

"నా మాట వినిపించుకో అన్నయ్యా ! నేను కృష్ణను తీసికెళ్ళటానికి రాలేదు."

"ఏమిటీ ?"

కృష్ణా, శ్రీరాం ఒక్కసారిగా అన్నారు.

"మరెందు కొచ్చావ్ ?" ఈసారి ఆర్ద్రంగా పలకరించాడు శ్రీరాం.

చించ కూడదని చెప్పింది డాక్టర్. నన్ను క్షమించు. ఇంకా కొన్నాళ్ళ పాటు నిన్ను రానుకోనియ్యను"

సరళ బిత్తరపోయి చూసింది ఇదేనా ? అన్నిసంగతులూ అంటే ఇంతేనా? ఇదేనా సుదర్శనం చెప్ప దలచుకున్నది ?

సరళ చూపులు సుదర్శనానికి మరోలా అర్థమయ్యాయి.

"అలా చూడకు సరళా! నన్నేం చెయ్యమంటావు చెప్పు ? నీకు వంట బాధ తప్పించాను ఇంటి బాధ్యత లేకుండా చేశాను చివరకు నాకు వంట్లో బాగుండక పోయినా నిన్ను బ్రామకోనిచ్చాము ఇప్పుడు, ఇంక నీతో నేనే విధంగాను సహకరించ లేను సరళా!"

నవ్వూ సిగ్గూ ముంచుకురాగా, భర్తబాహువుల్లో ముఖం దాచుకుని గుండెల్లో నవ్వింది సరళ సరళను ఆప్యాయంగా …తుంటూ-

"నీకు నామీద కోపం రాలేదా? నీకు కష్టంగా లేదా ?" అన్నాడు సుదర్శనం ఆనందంలో బెంగను వెతుక్కుంటూ.

"ఓహ్, ఇప్పుడున్నంతఆనందంగా ఈ జన్మలో ఎప్పుడూ లేను"

భర్తను మరింత … చేసుకుంది సరిగ్గా ఆ సమయంలో అడుగుపెట్టిన కృష్ణ చటుక్కున వెనక్కు తగ్గింది

సరళ సిగ్గుతో కుంచించుకు పోయింది.

"అన్నాళ్లు ముగ్గురం ఒకింట్లో ఉన్నాం. ఎప్పుడూ సరళక్కయ్యని కాని, ఇంత హాయిగా ఒక్కనాడూ చూడలేదుగదా!"

అంటూ పక పక నవ్వింది కృష్ణ. నవ్వుల సందడికి శ్రీరాం కూడా వచ్చాడు

"ఏమిటి తెగనవ్వుతున్నావ్!"

"ఇన్నాళ్ళకు చూడవలసిన దృశ్యం ఒకటి చూసి ఆనందం పట్ట లేక పోతున్నాను."

మళ్ళీ నవ్వింది కృష్ణ.

"ఛీ! ఫో! కొంటె పిల్లా!"

సంగతి వూహించుకొని నవ్వు నణచుకుంటూ ముఖంతిప్పుకున్నాడు శ్రీరాం.

సరళ ముఖం సిగ్గుతో కందిపోయింది. సుదర్శనం తర్జనితో బెదిరించాడు.

'అయితే, నువ్వు మాఅన్నయ్యను ప్రేమించావా ?'

ఆశ్చర్యంగా అడిగింది సరళ

"సరళక్కా! కాదు! కాదు! సరళాదినా! ప్రేమా గీమా నాకేం తెలీదు. నేనేం రచయిత్రిని కాను ఆ తియ్యని భావాలుండటానికి. ఒట్టి ఆశదాన్ని నాకు నాదంటూ ఒక ఇలూ, సంసారం కావాలి దానికి నేనే రాణిని కావాలి అది మీ అన్నయ్య నాకిస్తానన్నారు. నేనాయన్ను నా కాయశక్తులా సుఖపెడతాను అంతే!"

ఇన్నాళ్ళుగా మనసులో మెదల పడుతూ భాషనివ్వలేక పోతున్న భావాన్ని అతి సునాయాసంగా చెప్పేసిన కృష్ణవేణిని మెప్పుదలతో చూస్తూ ఉండిపోయింది ప్రఖ్యాత రచయిత్రి శ్రీమతి సరళా సుదర్శనం.

సమాప్తం

# తవ్వు ముల్లు

చిన్నగా జల్లు తుంపర దాంతో తినుగు. అయినా తప్పదు. ఉద్యోగం అలాంటిది. పొట్ట చేత బట్టుకున్నాక ఏఉద్యోగమయినా చేయాలి. ఉద్యోగమన్నాక ఎక్కడికయినా వెళ్ళాల్సిందే! కుగ్రామమని తెలుసు. తూము పుట్టదని తెలుసు. గోడు వినే వారుండరని తెలుసు. కానీ విధి. కాకపోతే ఎక్కడి హైదరాబాదు. ఎక్కడి 'ఎల్లనూరు.'

బస్ దిగాను, ఎల్లనూరు అని బోర్డుఒకటి ఉన్న నిర్జనప్రాంతంలో. చీకటి పడుతున్నట్లుంది. పక్కనే పెన్న. పెన్నానదిపడి ఉంది. చప్పగా ఉంది. ఎండిపోయి ఉంది. తిన్నెలు తిన్నెలుగా ఉంది. ఒళ్ళు ఆ ఇసకలోనే అల్లాగే నడుస్తుంటాయి కాబోలు. దారిఏర్పడి ఉంది. చుట్టూ చూచాను. ఆదరిదావుల్లో మానవుడు లేడు

చలిలాంటి వాతా
వరణం చలికాదు

తలకు మఫ్లర్ చుట్టాను పెలకు ఎక్కాయినసిగరెట్ తీశాను. ఆ చిత్తడిలో - హోరు గాలిలో - వెలిగించుకోటం కొద్ది కష్టమే అయింది. లోనికి పోయిన వేడి పొగలతో కష్టం ఫలించినట్లయి హుషారు కలిగినట్లయింది.

అది బురదకాని బురద. తడి ఇసక. బూటుతో నడవటం కష్టసాధ్యమయింది. బూటు విప్పి సంచిలో వేసుకున్నాను నడక హెచ్చించాను. తుంపరల్లా మెల్లగా వర్షంగా మారిపోయింది. అల్లంతలో మసక చీకట్లో చెట్టు కనిపించింది. పరుగెత్తాను, చేరుకోవాలని. ఆత్రుత, తొందర, తడుస్తానన్న గాబరా! బురద ఇసుకలో, లోతుకు దిగజారిపోతూ ఆ ఇసుకలో, పైన వానలో ... పరువెత్తటంలో కాలికిందఏదో కనుక్కుమంది.

ఏదో గుచ్చుకుంది బాధేసింది అయినా, ఆ వర్షంలో కాలు

సుషమ

ముల్లుకోసం తడమాలని అనిపించలేదు నిల్చోటంయిష్టం లేకపోయింది. లెక్క చేయక చెట్టు నీడకి చేరుకున్నాను ఎల్లాగో. ముల్లు, ముల్లు కాలూకు కాలి నెప్పి. ఆ చెట్టు కింద ఉన్న పెద్ద బండమీద కూచున్నాక గుర్తుకు వచ్చింది. పాదాన్ని చూచుకున్నాను. సెంటి మీటరు అంత ముల్లు. వాడిముల్లు. తుమ్మముల్లు! ముల్లు చిన్నదే అయినా ఎంత బాధ! పీకి పారేశాను.

"అబ్బా!" అన్నాను నాలో నేనే. చివ్వున రక్తం కారి బయటికి వచ్చినట్లయింది. ఎర్రగా ఉంటుంది అనుకుంటూనే చేత్తో పాదాన్ని రాసుకున్నాను మెల్లగా! ఎవరూ పక్కన లేనప్పుడు నా స్వగతాలన్నీ ప్రకాశం కావడం నాకు మామూలే...

"ఎవరు బాబూ?"

. గుళ్ళో నిశ్శబ్దంలో చిరుగంటలు మోగించినట్లయింది! ప్రశాంత నిశీధిలో పారవశ్యంతో కోయిల కూ అన్నట్లుంది. అర్ధరాత్రి పెద్ద భవంతిలో వీణ మార్మోగినట్లయింది. అంత మధురంగా ఉంది ఆ పలుకు. అంత తీయగా ఉంది ఆ పిలుపు.

అటుకేసి చూశాను. మసక చీకటే అయినా కనిపించింది. చెట్టు కొసనీడలోనే అయినా కనిపించింది. మత్తు గొలిపే రూపం. మరులు గొలిపే రూపం...ఎర్ర చీర కట్టింది. చిలుకపచ్చరవికె తొడిగింది. సిగలో మల్లెపూల దండ తురిమింది. పిక్కల వరకు తడవకుండా చీర కుచ్చెళ్ళని ఎత్తి నడుములోకి దోపుకుంది బలిష్టమైన పిక్కలు నున్నగా ఉన్నై. పైన నగ్నంగా ఉన్న జెత్తెడు పొట్ట అందాన్ని ఇనుమడింప చేస్తోంది. విశాల నేత్రాల్లో వింతకాంతి ఉంది. కొనదేరిన ముక్కులో అందం గూడు కట్టుకుని నిటారుగ్గా నిల్చుని ఉన్నట్లుంది. చిరుగడ్డంలో చిత్రకారుడి "ఫినిషింగ్ టచెస్" ఉన్నాయి.

"జాగ్రత్తయ్యా!... తుమ్మముల్లు. తుమ్మముల్లు గుచ్చుకుంటే బాగా నొప్పి. ముల్లూడ దీశినా నొప్పి మాత్రం ఉంటుంది!"

మూగనయి పోయాను. కోల కన్నులని చూస్తూ... రోగినయి పోయాను ఆరోగ్యంగా ఉన్న ఆ బుగ్గల్ని చూస్తూ. అంతెత్తు ఆ రొమ్ముని చూచి అవాక్కయి పోయాను.

వర్షం యింకా హెచ్చింది. జోరున కురుస్తూ... హోరని శబ్దం చేస్తోంది. లేచి నిల్చుందామనుకున్నాను. నిల్చోలేకపోయాను. ఆకలితో పేగులు అరుస్తున్నాయి. ఒళ్ళు స్వాధీనం తప్పుతోంది, ఒడుదుడుకుల రోడ్డులోని బస్సు ప్రయాణంతో.

సుతారంగా చంకలోని గంటె దించింది. తలెత్తి చూచాను. బాగా తడిసి పోయింది ఆమె. పక్క

నిల్చేమన్నాము. ఆ చెట్టుకి ఆ పక్క వైపునే జల్లు కొట్టుతుండాఉంది.

తడిసి పోయిన ఆ మనిషి ఒంపు సొంపులని చూసి మది పరవశించింది. మరి చెట్టుకింద మున్న దొకే బండ. జల్లు కొట్టునిది ఒకే 'ప్రక్క.' ఈ కొస నౌకరు ఆ కొస నౌకరూ. మధ్య అడుగు దూరం మాత్రమే ఉంది ఖాళీ.

అంతే ఉన్నట్టుండి గాలి వాటు మారి పోయి జల్లు నా కేసి కొట్టటం ప్రారంభించింది. అసలే చలి, వణుకు. జల్లు కొట్టేస్తే... ? ముఖం పక్కకు తిప్పుకున్నాను.

'అయ్యయ్యో ? ఎట్లబ్బా! నా నెక్కువయి పోతాందే! జల్లు మీ మీదికే కొడ్తాందే... ?' అంది.

ఆ మాటలో ఎన్నో అర్థాలు! ఎంతో భావన. ఆ అడుగు దూరం జరగొచ్చు నేను. జల్లు కూడ తగులక పోవచ్చు జరిగానంటే... కానీ... ?

ఆవిడ ఆదే ఆలోచిస్తూంది కాబోలు. పరాయివాడే అని... ? దగ్గర చేరనిస్తే... ? అని. నమ్మ వచ్చా ? అని... కానీ, కానీ, ఆమె పాటి మనిషి. మానవత ఉన్న మనిషి.

'పోనీ... ఇంకా ఈతట్టుకి రావయ్యా! జల్లు పడదు' అంది. ఆ అనటంలో ఏదో సందేహం ఉండక పోలేదు.

జరిగాను. దగ్గరిగా జరిగాను. ఓ రకమయిన వాసన. మల్లె పూల వాసన. కొత్త చీర వాసన. మనిషి వాసన. మగువ వాసన. మత్తుగా ఉంది. చిత్తుగా ఉంది. విభాయించు కోడం కష్టంగా ఉంది.

'యాడ బోతాండవయ్యా!'

'యల్లమూరు...!'

'జాలే...! కడావటి బస్సు లొచ్చి నావేమో గదా ?'

తలూపాను ఔ నన్నట్లు. మరి నా ఆ మూగ సమాధానం ఆమెకి అర్థమయిందో లేదో తెలీదు. కాని

---

కంపెనీ యజమాని ఆ రోజున ఆఫీసుకి రాగానే అందర్నీ పిలిచి తను కొత్తగా విన్న రెండు జోకులు చెప్పాడు. అంతా విరగబడి నవ్వేశారు. ఒక గుమాస్తామాత్రం మొహం చిట్లిస్తూ నిలబడ్డాడు.

'ఏం నువ్వు నవ్వటం లేదేం? జోకులు అర్థం కాలేదా?' అని యజమాని అడిగాడు.

'అది కాదండి. నేను రాజీనామా ఇచ్చి ఇంకో కంపెనీలో చేరబోతున్నాను' అని గుమాస్తా జవాబిచ్చాడు.

మతి చలించి పోతోంది. నా స్వాధీనం తప్పి పోతోంది. నన్ను కాదని పోతోంది. ఆ చలి ... ఆ వర్షం. పక్కన ఆ పిల్ల. చుట్టూ చీకటి... ఏదో వేడి కావాలని అనిపించింది. దహించి వేసే వేడి కావాలి. ఊలు దుప్పట్లతో కోసి కోసి చలి. వేలు తగ్గులతో ఒగ్గిపోని చలి. తెలుసు మందు పక్కనే ఉందని. ఉపయోగించే విధానం తెలుసు — కానీ... ఇది అటువంటి మందేనా? అని.

దరికి తీసుకు కొరికి వేయాలో? పిరికి వేసుకు ఊరకుండాలో?... అంత రాత్రిలో, ఆ చీకట్లో, తమ్మ పొదల్లో అడిగే దిక్కు — ఉండదు అరిచినా ఆలకించేవాడు ఉండడు. కానీ, చాచి దెబ్బవేస్తే పచ్చి ఊరకునేది ఖాయం. అందునా వచ్చే ముందు నెయ్యాలు అన్నమాటలు. ?

'జాగ్రత్తరోయ్! ఎల్లనూరు, పెన్నసీరు. ఏ వెకిలి వేషాలు వేస్తే నీ ప్రాణాలే వెలికి తీస్తారు. కట్టు తెగిన పిల్లయినా, గుట్టుగానే ఉంటుంది. కస్సుమనే నాగయినా, కవ్విస్తూనాన్నా ఊరకుంటుంది. వేర తీసి పోయావో కోరవిప్పి కాటేస్తుంది...'

ఆమాటలు గుర్తుకువచ్చి, అంతెత్తు ఉప్పొంగిపోయిన నా ఆ ఆవేశం చప్పున చల్లారిపోయింది.

కానీ వానయితే నిలువదు.

'ఏ పేరమ్మోయ్?...'

'...నీకేంటికో...?'

ఆమ్మో గడుసుదే. ఏమో నని కున్నాను.

'పనేదీ చెప్పవుగదా?'

'...పెన్న...!'

'ఈ పెన్నేనా...!'

'ఊఁ...!'

'ఏం పని చేస్తా...?'

పలుకలేదు పెన్న. ఎందుకో? నన్ను చూచి బెదురుతోందా?... నా ప్రవర్తన బాగులేదా? లేక, నాలోని భావాలని కనుక్కుందా? అడిగిన ప్రశ్న ముప్పు తేదే? నుడివిన తీరు తప్పుకాదే! మరెందుకో?

వర్షం నిలిచినటయితే గంప చంకనెత్తుకుని వచ్చింది పెన్న.

'ఊర్లోకేనా?' అంది.

కోపం ఉన్నట్లు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. అంత కోపంలోను మానవత్వం ఉంది. ఎదుటి వ్యక్తిని విడిచి వెడితే, తెలిసి వ్యక్తిని, తీరా ఆ మధ్య దారిలో వదలిపోతే అన్న బాధ కనిపించింది. ఊఁ... అన్నాను. నడిచింది ముందుకు.

జారు ముడి వేసినా, అందమైన సిగ చుట్టినట్టుంది. నూనె లేని కురులే అయినా నిగనిగలాడు తున్నాయి వానకు తడిసి గాయి. చౌకరకం చీర అయినా, జరీ చీరని మించిన సౌందర్యం కనిపిస్తోంది. నగలు లేకపోయినా వగలు చాలు

వెన్నట్లు. ఉగాదే నదు ముదాలు ఒయ్యారపు నడక ఖాలు...

అల్లాగే కమురు గయ్యే దాకా చూచాము కదలి కల్ని చూచాము. మనసు కుదుట పడ్డదాకా చూచాము. లేస్తూ లేస్తూ పెన్నలోని తడి యిసుకని పిడికిల్లోకి తీసుకున్నాము. వాసన లేదు రుచి లేదు. కానీ అదో అందం ఉంది, యిసుకలో. ఎర్రగా ఉంది. తెల్లగా ఉంది. ఆ రెంటి కలయిక ఉంది. ఏదో ఆకర్షణ ఉంది.

అడుగుతీసి అడుగువేస్తూ, ఆలోచిస్తూ, నడక సాగించాను వర్షం కాలూకు నీళ్ళు ఇసుకలో నిలచి పాదాలు కూరుకు పోతోంటే, ప్రయత్నాన పైకి తీసుకుంటూ నడుస్తున్నాను. ఇప్పుడు చలిలేదు కానీ గాలి ఉంది వాన వెలిసిం తరువాత వీచే చల్లటి గాలి, మనసుకి ఆహ్లాదం కలిగించే గాలి.

నా కోసమని ఎదురు చూస్తున్న కరణంగారి అందమయిన ఆతిథ్యంలో హాయి అనిపించింది. గోరు వెచ్చని నీటితో స్నానం కానిచ్చాను. మల్లె పూల్లాంటి అన్నం తిన్నాను. ఎన్ని చేస్తున్నా ... ఆ గింట కింది ఆ రూపం అలా మనసులో ఆడుతూంది...

చల్లని గాలివీచే చిన్నని గదిలో, తెల్లటి పక్కమీద దోమతెరల కింద పడుకున్నాము. నాలుగయిదు గజాల దూరంలో ఓపాక. కిటికీకి ఆవల వెన్నెల పెంచదిరి. పందిరికింది చక్కటి దిమ్మ నడక దగ్గరికి వెళ్ళాను. నేను వచ్చాననో, ఓక నవనాగరికత వల్లనో కట్టిన పల్చటి 'నైలాన్' తెర తొలగించాను. పండు వెన్నెల కాస్తోంది. వెన్నెల్లో పెన్న. అర్ధనగ్నంగా పెన్న. బిగుతుగా ఉన్న పెన్న పరువం, అతుక్కు పోయిన ఖట్టుల్లో అప్పుడు చూస్తే, అడ్డు కట్టిన చీర చిరుగుతోంది, వెన్నెల వెలుగుతోంది. విచ్చలవిడిగా పరుగుతీసే పెన్న పరువం యిప్పుడు కనిపిస్తోంది. వయసు తొందర చేసింది మనసు ముందర పరుగెత్తింది. పెన్న ...! పెన్న ...!

"పెన్నా!..." అని అరిచాను.

"మీరేమాయ్యా!"

కళ్ళు నులుముకుంటూ లేచాను కల చెదరిపోతే లేచాను. కానీ కలకి వాస్తవికతకి, అంత భేదం కనిపించ లేదు నాకు. మదిలో అనుకుంటూన్న పెన్న, కలలో కనిపిస్తూన్న పెన్న కళ్ళెదుట ఉంది కాబట్టి

> ఎన్ని కష్టాలొచ్చినా సరే, ఎవరితోనూ చెప్పుకోకుండా నిశ్శబ్దంగా భరించడం పెద్ద కష్టమేం కాదు— ముఖ్యంగా మనం అలా నిశ్శబ్దంగా భరిస్తున్నామన్న విషయం అందరికీ తెలుసునని మనకి తెలిసినప్పుడు!

"నీవా పెన్నా ? ..." అన్నాను.

"యాందబ్బా ! పొద్దున్నేస్తానే నా పేరంటూండారే ?"

"పెన్నంటే నీవే నేమిటి ?"

"మల్ల ? ఇం కె వు రు న్నా రి ఊళ్లో ?"

"ఉన్నారు ... ఉన్నారుగానీ ... !"

"గానీ ... ?"

"చెప్పనా ?" అంటూ ... ఎందు కయినా మంచిదని ముఖం మరోవేపు తిప్పుకుని అన్నాను.

"నీకన్నా అందంగా ఉంది. తెల్లగా, ఎర్రగా ఉంది. వింతగా ఉంది. పట్టుకుంటే మెత్తగా ఉంది..."

తిరిగి చూచాను. పెన్నకేమో కోపం వచ్చింది గావాల్ను అను కున్నాను. నవ్వుకున్నాను.

కాలకృత్యాలు తీర్చుకున్నాను. చేతి అద్దాన్ని గోడకి తగిలించుకుని జుత్తు దువ్వుకుంటున్నాను. పెన్న! తలుపు దగ్గర నిల్చున్న పెన్న... కనిపించింది! ఇప్పుడు నిన్నటి గుడ్డల్లేవు. కానీ నిన్నటికి ఇవాళ్టికి

చాలా తేడా ఉంది. ఆ తేడా కూడా అందంగా ఉంది. చదువూ, సంస్కారం లేని ఈ పెన్నలో ఇంతటి 'ఆర్టిస్టిక్ సెన్స్' ఎట్లా వచ్చిందని అనీ, ఈ కలర్ మేచింగ్ ఎలా తెలుసునని ఆశ్చర్యపోయాను. ఎర్రటి చీరకి, చిలుక పచ్చని రవిక నిన్న వేస్తే, ఇవ్వాళ చిలుక పచ్చని చీరకి ఎర్రటి రవిక వేసింది అందంగా. నుదుటిమీది కానంతటి కుంకుమ లోని చెమ్కా తళుక్కు మంటూంది. ఓ పాదం గదిలో వేసింది. ఇంకో పాదం ఎత్తిపెట్టి ఉంది లేనడుము వయ్యారంగా వంగి ఉంది. గడప దగ్గర నిలుచుండి పోయిన ఆ భంగిమ ఎంత అందంగా ఉందనీ?

"కాఫీ!" అంటూ ఆగిపోయింది పెన్న.

'అలా పెట్టి వెళ్ళు!' అన్నాను.

మళ్ళీ ఆ రాత్రి కనిపించింది పెన్న. నా కని ప్రత్యేకించిన గదిలో ఉన్న తెల్లటి పక్కమీది గుడ్డని దులుపుతోంది.

ఎంతకని ఆ వేశాన్ని అణచుకోను? అయినా అంత తెలీదా ఏం?' ... నా హావభావాలని అర్థం చేసుకో లేదా ఏం?..నా చూపులోని ఆశని గమనించి ఉండదా ఏం?...కానీ...అదో సిగ్గు. అదో భీతి. ఆడబుద్ధి.

లోన గదిలో పెన్న ఉన్నట్లే తెలీనట్లూ - అదేదో చాలా సాధారణంగా చేస్తున్నట్లు; మనసులోని వికారాన్ని బయటికి, ముఖంలోకి, కళ్ళలోనికి కనరాకుండా - ఎంత నటించానో?

తలుపు వేశాను. గట్టిగా వేశాను. వేస్తూ, గొళ్ళెంపెడుతూ కావాలనే సద్దు చేశాను. ఏమీఎరగనట్లు వెనక్కి తిరిగాను. పైని పదులు చేసుకుంటూ దూరాన కిటికీలోంచి కనిపించే కటిక రాత్రిని చూస్తున్నట్లు;...అంతా నటనే. లోన పెన్న ఉందని తెలియనే తెలుసు.

"అరే!... పెన్న! నీవులోపలే ఉన్నావా?"

"పెద్ద... తెలియనట్లు!"

చాలు. ఆ పదం చాలు. ఆ భావం చాలు. ఆ ముఖం చాలు. కన్నుల్లోని ఆ చిలిపితనం చాలు. నేను అన్నీ తెలుసుకునే చేస్తున్నట్లుగా, తెలుసుకుంటే చాలు. లోకాలు జయించవచ్చు ... పెన్న...

"పెన్నా...!"

ఇంచుమించు దగ్గరిగా చేరిపోయాను. చేతిలో చిక్కించుకున్నాను. కానీ... ఛెంగున పట్టు తప్పించుకుని గిరుక్కున తిరిగిందా పుటుక్కున జారిపోయింది కౌగిట్లోంచి. తిరిగిన ఆ విసురుకు వేసుకున్న జారుముడి విడిపోయేట్టు, నీలికురులు పెన్న వెనక భాగాన్నంతా కప్పివేశాయి. ఇంచుమించు ముడిచిన ఎర్రమందారం జారి పడిపోయేట్టు; నా మనసులోని వలపు సెగలు రేగేట్లు; [illegible]

[illegible] తెరలు కప్పివేశాయి. కన్నుల్లో కామం కాలుతూ పొరలు కప్పివేశాయి.

ఇంకా చల్లారని ఆవేశంతో, చేతిలోంచి, పట్టు విడిపించుకుని జారిపోయిందే అన్న అవమానంతో మరోసారి ఇంకా దగ్గరికి వెళ్ళి భుజాలు పట్టుకున్నాను 'పెన్నా!' అంటూ.

ఛెళ్ళుమంది చెంప! అటువక్క ఇటువక్క. ఒక్కసారి. రెండుసార్లు. వటవట! కళ్ళు తిరిగేట్టు. మైకం తొలిగేట్లు. ఆవేశం చచ్చేట్లు తిరిగి ఈ లోకంలో పడ్డాను. పెన్న పెన్నలాగా లేదు ఆవేశంతో ఉంది. అంత చివరిలోనూ ఆగ్రహం ఉంది. వరదలు వస్తే ఉరకలు వేసే గోదావరిని మించి ఉంది.

చేసిన తప్పుకు తలెత్తలేక పోయాను. వెంటనే వెళ్ళిపోతుం దనుకున్నాను ఆవేశంలో ఏమో చేస్తుందనుకున్నాను కరణంగారితో చెప్పేస్తుం దనుకున్నాను తన వారికి చెబుతుం దనుకున్నాను. పెన్నకే యింకోటి ఆవేశం ఉంటే ..; అయినవాడో - అయ్యేవాడో ... గానీ తలచుకుంటే ? మగాళ్ళు విరగ తంతారు. ఎముకలు కనిపించకుండా నుజ్జుచేస్తారు. వాడు చెప్పిందినిజమే. తప్పుమావే నాకు కూడా కవ్విస్తుంటే [illegible]ఉంటుంది. మేలతప్పితే మాత్రం [illegible] తిప్పటం [illegible] తలెత్తి చూశాను. పెన్న ఏడుస్తున్నా పెన్న!

పెన్న యింకా ఉంది. విడివడ్డ కురులను తీసి వెంట ముడి వేసుకుంటూంది. తొలగపడ్డ కొంగు తీసి నడుముకు బిగించింది అబ్బ! ఎంత ధైర్యం. దెబ్బతప్పించుకున్న దెబ్బలితో నేనా పరాచికాలు? కనీసం ఆ భయమయినా కళ్ళల్లో లేదే? మళ్ళీ వెళ్ళి జబ్బ పట్టుకుంటే? ఏమిటీ ఈ పెన్న ధైర్యం? తెగించలేనా? తెగించననా?

లేచాను. అంతదాకా లేని నెప్పి, అంతదాక బాధించని కాలి నెప్పి. ముల్లు! తుమ్మముల్లు. అదోలా కలుక్కుమంది మనసు బాధతో చివుక్కుమంది అబ్బా అన్నాను.

పాదమెత్తి చూసుకున్నాను. తుమ్మముల్లు గుచ్చుకున్న చోటు. అక్కడిదే ఆ పోటు.

'నేం చెప్పలేదాయ్యా! తుమ్మముల్లు మా పెద్దదనీ .. కావాలని నీవు పోవు అదిగూడ కావాలంటుని నీ దగ్గరికి రాదు కానీ రెంటిలో ఏది జరిగినా నెప్పి మాత్రం తానా ఉంటాది కదా!' ఆపేసింది పెన్న .. ఉన్నట్టుండి లేచి, నా కళ్ళలోకి సూటిగా చూస్తు అంది. '...అయ్యా! ఇంకోటి చెప్తాన్నాయనూ.. ఆడదాని మనసూ అంతే తుమ్మముల్లుమాదిరే ఉంటాది. పోయిందిలే అని పీకేసినా.. నూడు యిప్పుడెంతటా ఉండాదో? నొప్పుండాదో? సావా [illegible] అట్లే ఉంటాది. తమా [illegible] మ్యాక్షాన తనదవుతుం

దనుకో క...; ఏ...ము వి చ్చి
న ం త మాత్రంతో పరస
కొస్తుందనుకోవాళ ; అడ
కూతురంటే అంత అలుసు
చెయ్యొద్దు! అ యి నా,
అయ్యా అంత మా పెద్ద
కా మ ం గానంటె మా
నాగ్గాడికి పె ప్తే సా లే;
అలగా రకం పి ల్ల ల్ని
మూడినిమిసాలల్లో ముంద
రే స్తా డే ? అ యి నా
అ య్యా యి దే ం

పాడుబుద్ధి నుగాబట్టిసరిపోయింది. యింకో రియుంటె... ఈ పాట్ను పెప్పంటే నీ దేగం బుగ్గి అ యి పోయి ఉ ధక పోనేం ?..."

బయట తలుపు దగ్గర సద్దయింది. ఎవరో బలంగా త లు పు కొ డు తున్నారు.

"పె న్నో య్... పెన్న!..." అంటూ.

"ఓ య్యా! ఓ కొ త్త య్యా! పె న్న వుం డా దా లో ప లా! వాకిత్త య్యా!" అని

అ మ్మో నా గ న్న! పెన్నకే యింత ఆ వే శ మూ - కో ప మూ ఉంటే ?... అందునా ఇక్కడ... ఈ రా త్రి ... ఈ గ ది లో... ఒ టరిగా... ? హే భగవాన్! గుండెలు గుభీల్ మన్నాయి అచేత నుడినై పోయాను. ప్రాణం పోతుం దని గాదు, ప రు వు పోతుందని.

తన్నులు తింటానని గాదు, [illegible] పోగలదని.

"శా! పెద్ద మొగాడివి [illegible] టులు గాదు్సకునేంత [illegible]... ఏంటికి ? మా నాగ [illegible] దేం గాదులే. నీచంగా [illegible] కోనే లేదు పదు వెక్కువ [illegible] అ బుద్ధులు. కాస్తంత పకా [illegible] పెళ్ళాం మాట్టాడితే స్తా లు... ? పరాయోడి పెళ్ళాం కాస్తంత పను వుగా మనుత్తే సాలు. ఛీ...ఛీ...!"

అంటూ నేనడచింది తలుపుదగ్గరకు. గొళ్ళెం తీసింది పెన్న. వ యేమని దూసుకు వస్తూనే పెన్నని గట్టిగా హత్తుకుని గరగిరా తిప్పాడు పెన్నని నాగన్న ఎత్తి...

"నాకు పెప్ప లేదేంటికే ? వాకి తీసు కొందుముగదా యిద్దరం..!"

"ఛీ! ఫో మా మా! అ త నూడు!" వేలెట్టి నన్ను చూపించింది పెన్న.

ళ్ళు ఉబికాయి అంది.

ఇంత పెద్ద "అంగీ ఓకయ్యా!" అని. పెన్న కనిపించిన ఆ తృప్తి చాలు. చూశాక నాకు మనసులో తృప్తి కలిగింది.

'నయితే...'

మాట!'

పోయాను. కన్నీటితో వచ్చింది పెన్న. దగ్గరికి వచ్చి చెంపలు రాసింది. మృదువుగా మెత్తగా మధురంగా.

'శానా గట్టిగా కొట్టినా గదా! ఛ. పాపిష్టిదాన్ని... అయినా ఏంటి కయ్యా నాతో ఆడ్నావు ఆ య్యా! అన్నట్లు నే నూ మా పెన్నే రూ ఒకటి. సరదలొస్తే మా ఏటిని పట్టలేం...!' అంది

పెన్న అలా రాస్తుంటే ఆవేశం కలగలా. ఆదరణ గలిగింది. కామం కలగలా కరుణ కలిగింది. ఓ ప్రేమ గలిగింది నా చెల్లాయి రాస్తున్నట్లు. నాన్న కొడితే అమ్మ అనునయిస్తున్నట్లుంది "అబ్బ ఎంతగా కొట్టేర్రా!" అని.

నడక హెచ్చించాను. పెన్నా నదిలో. మనసులో ఆ పెన్న గుర్తుకు వస్తూంటే ఎక్కడో అడుగేశాను దారితప్పి. కలుక్కుమంది కాలు. పాదం ఎత్తి చూశాను. ముల్లు గుచ్చుకుంది. తుమ్మముల్లు!

"ఛపో! ఊర్కో. ఎవ్వుడూ సీకు ఆ మాటే...! ఆయనెవరో తెల్దా ఆఫీసరు...!"

పని అయిపోయిన మర్రోజు. గది తోవికివచ్చిన పెన్నని పిలిచాను.

"ఏమయ్యా!"

"వెడుతున్నాను...!" ముక్తసరిగా అన్నాను. మంచిదయ్యా అమ్మ యిస్తే శాకత సెప్తావా అయమ్మకి!" అదోలా నవ్వింది.

అంతకోపంలోనూ నవ్వు రాక పోలేదు నాకు.

"ఇంద!" పదిరూపాయల నోటు యివ్వ బోయాను.

"వద్దయ్యా! ఉఫ్! నీ కాడేన్నె ఉంచుకుని, అమ్మయ్యకి నా పేరిట అగ్గువలో ఓ కోక కొని య్య... పాలు...!"

"ఊహూ అలాకాదు. ఏదో ఒకటి తీసుకోవాలి. పోనీ, యింద ఈ పర్సు తీసుకో. నాగన్న కివ్వు. నాగన్నని నీవు ఆ పర్సులో చూస్తే నేను గుర్తొస్తుంటాను!'

***

# పొట్టి కథలు

"...ఇప్పుడు ఏ పని చెయ్యడానికైనా కంప్యూటరు వున్నాయి'

"మరి, మనుష్యు లెందుకు?"

"కంప్యూటర్లు కనిపెట్టడానికి."

—"బంటీ" మద్రాసు

* * *

అర్ధరాత్రివేళ కాన్‌స్టేబులు ఇంట్లో దొంగలు పడ్డారు. అతని భార్యకి మెలకువ వచ్చింది. "ఏమండోయ్. ఇంట్లో దొంగలు పడ్డారు. లేవండి" అని లేపింది.

కాన్‌స్టేబులు పరాకుగా చిరాకు పడుతూ "పడితే పడ్డారు లేవే! ఇప్పుడు డ్యూటీలో లేనుగా!" అన్నాడు.

* * *

ఒక తాగుబోతు రోడ్డు పక్కన ఎలక్ట్రిక్ లైటుకింద ఏమిటో వెదుకుతున్నాడు. దారేపోయే దానయ్య "ఏమిటోయ్, వెదుకుతున్నావ్?" అన్నాడు.

"చిల్లరడబ్బులు పడ్డాయి. వెదుకుతున్నాను" అన్నాడు తాగుబోతు.

"ఎక్కడ పడ్డాయి?"

"అదుగో అటుపక్క పడ్డాయి"

"అక్కడ పడితే ఇక్కడ వెదుకుతున్నావేం?"

"అక్కడ చీకటిగా వుందనే! అందుకనే ఇక్కడ వెదుకుతున్నాను" అని సమాధాన మిచ్చాడు తాగుబోతు.

—బి. గణపతిరావు

హైదరాబాదు

* * *

కొత్తగా వచ్చిన కోడలపిల్ల చేత, అత్తగారు ఇల్లంతా శుభ్రం చేయిస్తోంది. కాని ఆమెకు ఎంత సేవయినా తృప్తి కలుగలేదు. ఇంకా అశుభ్రంగా ఉందని, బూజులు

వదల్లేదని, సామానంతా [illegible]చేశాన్నా. ఈ మధ్య తీసి తీసుకు ఉందనీ అంటోంది. కొం[illegible]యాడు !"

[illegible]వై౦ ఆ కోడలుపిల్ల అత్తగారి కళ్ళద్దాలు తీసి చక్కగా తుడిచి అత్తగారికి తిరిగి ఇచ్చేసింది. అత్తగారు ఆశ్చర్యపోయింది. "అరె! చిటికెలో ఇల్లంతా శుభ్రంగా అద్దంలా తయారయిందే!" అంది.

* * *

"ఆకుకు ముల్లుమీద కోపం వచ్చినా; ముల్లుకు ఆకుమీద కోపం వచ్చినా ఆకుకే నష్టం. అలానే, ప్రేక్షకులకు చిత్రపరిశ్రమపై కోపం వచ్చినా, చిత్ర పరిశ్రమకు ప్రేక్షకులపై కోపం వచ్చినా చిత్ర పరిశ్రమకే నష్టం!" అని మొన్న ఒకాయన అన్నాడు.

—ఎన్. వి. ఎస్. ఎన్. మూర్తి

బరంపురం

* * *

"ఏమిటబ్బాయీ, చదువు రోజు రోజుకీ ఇలా తగలడుతోంది? నువ్వు క్లాసులో ఆఖరు వాడివిట, ఇవాళ తెలిసింది!"

"అవున్నాన్నా. ఈ తప్పంతా రమణయ్యది."

"ఏం, వాడేంజేశాడూ, మధ్యని?"

"మొన్నటిదాకా ఆఖరు వాడు [illegible]

* * *

"మనకి తెలియని విషయములలో అనుభవజ్ఞులు చెప్పినట్లు వినవలెను. ఇట్లు చెప్పువారలలో ముఖ్యులు ... ... ... ఏదీ, రామకృష్ణా, ఒక ఉదాహరణ ఇయ్యి!"

"క్షౌరం చేసుకొనునప్పుడు మంగలి చెప్పినట్లు వినవలెను."

"ఛీ ... ఏదీ బ్రహ్మచారీ, నువ్వు!"

"ఫొటోగ్రాఫరు చెప్పినట్లు వినవలెను ..."

* * *

టీచరు :— కాళ్ళు ఎందుకురా, మనకి? — సుబ్బారావూ?

సు :— ముల్లు విరిగితే తీసుకోడానికండి.

టీచరు :— కృష్ణమూర్తి, నువ్వు!

కృ :— జోళ్ళు తొడుక్కోడానికండి.

టీ :— రామబ్రహ్మం, నువ్వు!

రా :— ఏదేనా తొక్కితే కడుక్కోడానికండి.

టీ.—ఛీ. అప్రాచ్యపు వెధవల్లారా! నడవడానికని ఒక్క వెధవ కూడా చెప్పడేం?

మోహన్రావు :— తమరు చెప్పేరు కదండి!

—"భరాగో"

***

కాళ్ళరిగే వరకూ ఊరి నలు మూలలా తిరిగి చివరకు నడవడానికి కూడా ఓపిక లేక — హోటల్ మిలాప్ వరండాలో దిగులుగా, నిరాశగా, నిస్పృహగా నిలబడి అటూ యిటూ చూస్తున్నాడు సుజన.

"బాబూ... ఒక... పైసా..."

స్వప్నసుందరి ప్రేమ పిలుపుకు వెయ్యి రెట్లు మధురంగా — ఆశలు కొలుపుతూ — వినిపించిన ఆ స్వరానికి — అతను ఒక్కసారి చాలా ఆశలు కళ్ళల్లో నింపుకుని ఆ వంక చూసేడు.

ఆ క్షణంలో ఆ కళ్ళు అమావస నిశి మేఘాలపై మెరిసిన ఒకే ఒక్క మెరుపులా అనంత కాంతులు నింపుకున్నాయ్

అతని నయనాలలో కోటిదీపాల కాంతి కూడా సరితూగనంత ఆశా కిరణాల వెలుగు ఉదయించింది. అతని వొళ్లో ఒక్కసారి వెయ్యి ఏనుగుల బలం వచ్చింది.

తల్లిని విడిచి యువతలకు రాలేని పసిపాపలా — దుర్భర దృశ్యం నుంచి మరలి రాలేక అక్కడే స్థిరపడిపోయిందతని దృష్టి కొన్ని క్షణాల పాటు.

సంకోష సంభ్రమాలు ఒక్కుమ్మడి ముప్పిరిగొనగా అతను పారవశ్యంలో కొన్ని నిముషాలచేతనుడై నిలచి — అంతలోనే తేరుకుని — మెల్లగా మెట్లు దిగి — తన దృష్టి కేంద్రీకరించబడిన ఆ స్థానానికి దగ్గిరగా వెళ్ళి నిలుచున్నాడు

"బాబూ ... పైసా ..." బహు దీనంగా అర్థిస్తున్నాడు బిచ్చగాడు — తరతరాల దారిద్ర్యం నరాలలోని సత్తువంతా పీల్చి, నరరూపం మాత్రమే మిగిల్చిన నిర్భాగ్యుడు.

ఇచ్ఛాపురపు రామచంద్రం

"నాతో వస్తావా ?..."

పరికించి చూసేడు పేదవాడు.

గత జీవితంలో ఏనాడూ అనుభవానికి రానిదీ; ఆశించలేనిదీ అయిన ఆహ్వానం!

అంతస్థులలో అయినకూ తనకూ ఊహించలేని తారతమ్యం.

అనుమానాలతో — ఆశలతో — అక్కడ మనిషిలా లేని - ఆ స్వరూపం సుజన వెంట కదిలింది - ఒక స్థిపంజరానికి చలనం వచ్చినట్లు. సుజన ఉరకలూ పరుగులూ పెడుతున్నాడు నడవబోయే మైలు దూరమూ మూడంగల దూరంగానే కనుపిస్తూందతని ఉత్సాహంలో. కొన్నిక్షణాల క్రితం వరకూ ఆవరించిన నిరాశాంగులూ ఒక్కసారి ఆశగానూ ధైర్యంగానూ పరిణామం చెందడంతో అతనికి కొత్తశక్తి కలిగింది

తన అన్వేషణ సఫలమౌతుందన్న ఆశతో అతను ఆత్రుతగా నడుస్తున్నాడు.

అతని కళ్ళ ఎదుట — మనుషులు లేరు ... వాహనాలు లేవు ..

ఉన్నదొక్కటే. రంగు రంగుల భవిష్యత్తు ... కలలో సుందరిలా ఊరిస్తూ, ఉవ్విళ్ళూరిస్తూ.

అతనికి పూర్తిగా విభిన్నంగా ఉన్నాడు పేదవాడు.

భారమైన వర్తమానం—అతని పాదాల కడ్డు పడుతోంది.

బాధాకరమైన గత—ంతని గమనానికి నిరోధమౌతోంది.

ఊహకందని - విశృతంగా ఎదురౌతున్న భవిష్యత్తు—అతనికి భయం కొలుపుతోంది.

అతని స్థితిలో అడుగుతీసి అడుగు వేయడం అంత సుళభమేమీ కాదు. ఇన్ని నిరాశల చీకటిమధ్య ఒక సన్నని చిన్ని ఆశాకిరణం తాత్కాలికంగా వెలుగుతోంది. కాబట్టే అతను క్షణాలను జయించడానికి తనలో మిగిలిఉన్న అతి స్వల్పమైన శక్తుల్నాహ్వానిను వెచ్చిస్తూ ఎలాగో ముందుకు సాగ గలుగుతున్నాడు.

సుజనకీ అతనికీ నడుమ కొన్ని గజాల దూరం -

కొన్ని దశాబ్దాల అంతరం.

యౌవన ప్రాంగణంలో నిలచి— విషాదంగా ఉన్న వర్తమానాన్ని భవిష్యత్తు బంగారు కలలలో ఐ చేస్తూ — తన ఆశలు సఫలమయ్యే క్షణాలకోసం ఉత్సాహంగా నిరీక్షిస్తున్న సుజనకీ — వృద్ధాప్యపు చివరి అంచున - జీవితానికి చరమగీతం పాడి - ఉపరి తలానికి ఎగసిపోవాలని - శారీరకంగానూ మానసికంగానూ - సంసిద్ధుడౌతున్న భిక్షుకునకూ నడుమ అంత వ్యత్యాసం ఉండక మానదు.

జీవితమంతా ముందే ఉంది సుజనకి.

జీవితం చివర క్షణాలకు వచ్చేసి- నేడో రేపో రాలిపోయే ఎండుటాకుకి ప్రతి రూపం ఆ భిక్షుకుడు. రాలిపోయే వరకూ ఏదో ఒకలా వృక్షాన్నంటి పెట్టుకుందామనే ప్రయత్నిస్తుంది పండుటాకు.



అతనూ అంతే. శతకోటి చీకట్లలో ఓడిపోతూ మలిగి పోవడానికి రెప రెప లాడుతున్న చిన్న జ్యోతి. ఊహాకందని ఆశాలేశం ఏదో ఇంకా అతనిలో మిగిలిన కొద్దిపాటి రక్తపు బిందువుల్ని శక్తి కణాలుగా మార్చి నిలువుతోందతన్ని. ఆ దీపం ఏ క్షణంలోనైనా ఆరిపోవచ్చు.

వెనుదిరిగి చూసేడు సుజన.

భిక్షుకుడు వస్తున్నాడు.

సుజనలో మళ్ళీ ఆశలు చెలరేగాయ్.

తన ఆశ... ఆశయం ... వీటన్నిటికీ ఐదేళ్ళ చరిత్ర ఉంది. తనను తెలిసినవారు చాలా తక్కువ. సుజనగా తను చాలా మందికి తెలియాలి. రసజ్ఞుల హృదయాల్లో తనకు శాశ్వత స్థానం లభించాలి. దేశంలో ....వీలయితే ... అంతర్జాతీయంగా తను పరిచితుడు కావాలి సుజనగా.

ఈ క్షణాల్లో అనిపిస్తోంది - తన ఐదేళ్ళగతమూ - దానిలోని శ్రమా అన్నీ ఫలిస్తాయని.

ఆ గతంలో ... విచారించదగిన ఘట్టాలు చాలా ఉన్నాయి.

రోడ్లమీద మసి బొగ్గుతో

చిత్రాలు గీసి - కడుపు నింపు కోడంతో ప్రారంభమైంది తన కళ.

ఆకలి కోసం - అహాన్ని చంపుకుని - సినిమా వాల్ పోస్టర్లు రాసేడు. తనలోని కళ ఎదురుతిరుగుతున్నా కడుపుకోసం - కమర్షియల్ చిత్రాలు గీసేడు సినిమా స్లైడ్లు కూడా రాసేడు.

అనంతా కళాసాధన కోసంకాదు. కడుపు నింపుకునేందుకు.

ఆ ఐదేళ్ళలోనూ తను గీయగలిగిన మంచి చిత్రాలకే తన పేరు- కుంచె పేరు - సుజన అని పెట్టుకున్నాడు.

తను కొన్ని మెట్లెక్కగలిగాడు. ఒడిదుడుకులు తప్పక పోయినా జీవితం నిరాశా జనకంగా సాగడం లేదు.

ఈ నాడు వస్తు లుండ వలసి వచ్చినా రేపు కడుపు నిండుతుందన్న ఆశ ఉంటోంది బాకీ పడుకున్నా స్టుడియో అద్దె సరిగ్గానే చెల్లించగల్గుతున్నాడిప్పుడు. సుజనగా ప్రారంభమైంది జీవితం. అలాగే సాగి—చివరికి సుజనగానే ఉజ్వలంగా వెలిగి అంతం కావాలి తన జీవితం

ఆలోచనా హర్మ్యాలలో అతనూ; ఆయాసంతో భిక్షుకుడూ ఇద్దరూ స్టుడియో అని చెప్పబడే సుజన గది చేరుకున్నారు కొన్ని నిముషాల తేడాతో.

సుజన లోపలకు నడిచినా—

అతను మాత్రం ద్వారం దగ్గరే నిలబడిపోయాడు ప్రవేశించడానికి సంకోచిస్తూ.

డ్రాయింగ్ బోర్డుకి షీట్ ఫిక్స్ చేసి వెనక్కి తిరిగి ఆ భిక్షుకుడివంక చూస్తూ అన్నాడు సుజన—'లోపలకు వచ్చి అలా ఎదురుగా నిలబడు—'

భిక్షుకుడు అతని ఆజ్ఞను శిరసా వహిస్తూనే ఏదో అయిష్టత ప్రదర్శించాడు. సుజన అది గమనించ లేదు.

సూది మొనలాటి చివరకల పెన్సిల్ను చేతిలోకి తీసుకుని— 'లా కాదు. కొంచెం ముందుకు వంగు ... ముఖం ... కొద్దిగా కుడివక గా వంచు' అజ్ఞాపించాడు సుజన.

'ఆకలి—'

'ఉష్ ... కొంచెంసేపు మాట్లాడకు. కదలకుండా అలాగే నిల్చో' అతని రెండు కళ్లూ అతి గంభీరమైపోయాయ్.

ఒక కంటితో భిక్షుకుణ్ణి చూస్తూనే రెండో కన్ను పెన్సిల్ మొనపై నిలుపుతున్నాడా అనిపిస్తూంది.

అస్థిపంజరానికి ప్రతిరూపం ఏర్పడింది షీట్ మీద.

నరాలు చివికిపోయి — చర్మం జారిపోతూ — ఎముకలు బయటకు పొడుచు కొస్తున్నట్లు...

ఒక్కసారి పరిశీలనగా భిక్షుకుడి

పొట్టవంక చూసి చిత్రంలో ఆ భాగానికి షేడ్స్ ఇచ్చాడు.

ఇప్పుడు చిత్రంలో - పొట్టలోంచి పేగులు బయట పడుతున్నట్లే ఉంది. ఎండిన గుండెలూ ... మండే కడుపూ ...

బీహారు కరువుకి మరో రూపంలా ఉన్నాడు ఛార్‌కోల్ చిత్రంలోని మనిషి.

ఒక్కసారి గుండెల నిండా గాలి పీల్చుకున్నాడు సుజన. భారతదేశంలో ఇంతకంటె వాస్తవికత మరొకటి లేదు. ఆకలి కంటె మరొక సత్యం ఏముంది?

సిగరెట్ కాల్చుకోవా లనిపించి చూసేడు. అగ్గిపెట్టెలో చివరిపుల్ల మాత్రమే మిగిలింది. నేలమీదకు వొంగి ఆశగా ఏదయినా తను పారేసిన సిగరెట్ పీకయినా దొరకదా అనుకుంటూ వెతికి హఠాత్తుగా మళ్లీ బోర్డువంక చూసేడు.

తన చిత్రంలో వాస్తవికత - అతి వాస్తవికత - ఉంది. కాని ... సమగ్రత లేదు.

ఒక్క క్షణం వెదికి తన ఊహను పట్టుకున్నాడు.

ఆకలి వాస్తవికతేగాని - ఆశ కూడా వాస్తవికతే!

జీవితాన్ని నడిపించేది ఆకలే కాదు - ఆశకూడా!

ఆశకు స్వరూపం ఇవ్వాలి తన చిత్రంలో ఆకలి - ఆశా రెండు చోటు చేసుకోవాలి. అప్పుడే సంపూర్ణత ఏర్పడి - జీవితం ప్రతిబింబిస్తుంది.

అన్నిభావాలకూ స్థానం కళ్లు.. కళ్ళు మినహా ముఖం అంతా చిత్రించేడు పలితకేశాలూ .. పాలిపోయిన చర్మపు రంగూ ... ఛాయలో చక్కగా రూపొందాయ్.

దట్టమైన కనుబొమ్మలు ... సన్నని నాసిక ... కనురెప్పల దిగువ వలయాలు ... చర్మంలో ఏ మాత్రమూ బిగువు లేనట్లు వదులుగా బలహీనంగా జారిపోతున్నాయా అనిపిస్తున్నాయ్ పెదవులు.

అచలన చిత్రంలోకూడా ఏ మాత్రపు చిరుగాలికైనా కంపించిపోతాయేమో అన్న భ్రమను కలిగిస్తున్నాయ్ భిక్షుకుడి పెదవులు.

ఒక్క నిట్టూర్పు విడిచాడు సుజన. దూరంగా గడియారం నాలుగు గంటలు కొట్టింది. పోస్ట్‌వేళ అయి

"ఈ ఏడాది నీకు బాగా లాభం వచ్చిందంటున్నారు నిజమేనా?"

"పదివేలు."

"అబ్బా. పదివేలే?"

"నిరుడు ఇరవై రెండువేలు నష్టం. ఈ ఏడు పన్నెండు వేలే నష్టం!"

...లి చేనేత వస్త్రాలు తరతరాలనుండి వస్తున్న కళకు, ఉన్నత సాంప్రదాయా...
...చ్చుతునకలు. ఇరవై అయిదు శతాబ్దాలుగా ప్రతి తరంలోను ఉన్నతమైన సృజనాత్మక శక్తి క్రొత్త మెరుగుల... ...ద్దుకొంటున్నది. ప్రభుత్వము చేసిన సాంకేతిక ఆర్థిక సహాయం మూలంగా ఈ రెండు దశాబ్దాలుగా చేనేత పరిశ్రమ... ...తో అభివృద్ధి సాధించింది. నూలు వస్త్రాల ఉత్పత్తిలో భారతదేశం ప్రపంచంలో తృతీయ స్థానమాక్రమించింది. ఈ... ...త్పత్తిలో నాలుగో భాగం దేశంలోని మూడు మిలియన్ల చేతి మగ్గములు తయారుచేస్తున్నాయని బహుశా వాల నుండో... ...రియకపోవచ్చు. మరి ఎనిమిది మిలియన్లమందికి ఉద్యోగాలు ఇందుమూలంగా లభించాయి. నూలు మిల్లులలో... ...ద్యోగుల సంఖ్య ఒక మిలియను మాత్రమే. చేనేత పనివారికి ...ఇది జీవనోపాధిగానే గాక జీవన విధానంగా వుంటున్నది



భారతదేశ చేనేత వస్త్రాలు— 25 శతాబ్దాల సాంప్రదాయానికి నైపుణ్యానికి చిహ్నాలు

20

ఇరవై ఏళ్ల స్వాతంత్ర్యము

పోతోందని మళ్ళీ అతను త్వరపడ సాగాడు.

ఇక మిగిలినవి కళ్ళు.

ఈ కళ్ళలో ఆశాకిరణాలు ఉజ్జ్వలంగా మెరవాలి.

అప్పుడే తన ఊహకు పరిపూర్ణమైన రూపకల్పన జరుగుతుంది

ఆకలి - జీవితం - ఆశ... అనే తన క్యాప్షన్‌కి చిత్రం అన్నికోణాల్లోంచి సరిపోవాలి.

ఆకలి మేరకు తను కృతకృత్యుడయ్యాడు ఇక - ఆశ!

ఇక్కడే తను అతి జాగ్రత్తగా శ్రమించాలి.

ఇక్కడే తన నైపుణ్యం నింపాలి

ఇక్కడ - యీ కళ్ళల్లో ఆశను వెలిగించటంలోనే తన ప్రతిభ ప్రదర్శించాలి

సుజన - ఆ భిక్షుకుడి కళ్ళల్లోకి సూటిగా చూసేడు.

"బాబూ... ఆకలి..." కంపిస్తోం దతని శరీరం.

సుజన ఒక్కక్షణం నిరుత్సాహపడి పోయాడు.

ఆ కళ్ళలో కాంతి క్షీణించి పోతూ... గాజు కళ్ళల్లా...

వీల్లేదు-ఆ కళ్ళలో ఆశాస్వరూపం తన మెదడుకు అందాలి.

హఠాత్తుగా అతని మెదడులో అద్భుతమైన ఊహ మెదిలింది.

మాసిపోయిన రంగుగ్లాసులోకి జాగ్రత్తగా ఫ్లాస్కు వొంపాడు.

అతని హృదయం బాధగా మూలిగింది.

అతనిలోని మానవత్వం ఎదురు తిరిగింది.

ఎలాగో అంత శ్రమను జయించి మట్టిపట్టి - మాసిపోయిన - ప్లాస్టిక్ గ్లాసుని భిక్షుకుడి కివ్వబోతున్నట్లు ముందుకు చెయ్యి జాపాడు.

ఆ భిక్షుకుని కళ్ళు ఆరిపోయే ముందు వెలిగే దీపాల్లా ఒకసారి ఉజ్వలమై ఆ గ్లాసులోకి చూడాలని... 41

సుజనకు కావలసినది దొరికింది.

అతని చేతిలోని పెన్సిల్ మెరికలు తిరిగింది.

కొద్ది నిముషాలలోనే విశ్వాసపాత్రుడైన సేవకుడిలా తన ధర్మం నెరవేర్చింది.

ఆ కళ్ళలో అతను కోరుకున్న దీప్తులు ప్రతిఫలించాయ్.

ఒక్కసారి చిత్రాన్ని సాకల్యంగా పరిశీలించి బోర్డుమంచి తీసి - నిన్న సాయంత్రం షర్టు అమ్మి కొన్న కవరూ స్టాంపులూ డ్రాయర్‌లోంచి తీసి - హడావిడిగా బయటకు వస్తాడు ఫ్లాస్కు కూడా తీసుకుని.

కవరుపోస్టు వేసి - తక్షణం అతనా ఫ్లాస్కు అమ్మజూపే డాత్రుతగా. మరి పాతబడినదని పావలా కూడా ఎవరూ కొనక పోవడంతో కసీసం తన రంగులు కుంచెలూ అమ్మి అయినా ఏమైనా తినడానికి సంపా

మూడు నాళ్ళలో వండించాలను కోవటం వట్టి నాన్సెన్సు. నా ఉద్దేశంలో దెబ్బయి రెండు గంటల్లో ఒకర్నొకరు అర్థం చేసుకొని జీవితాంతం కలసి వుంటామని నిర్ణయించుకోవటం కన్న మూర్ఖత్వం మరొకటి లేదు. అందులోను ఇలా మరొకరి పెళ్ళిలో, అంత కలర్‌ఫుల్ అకేషన్‌లో ఎవరికళ్ళయినా ఇట్టే వాళ్ళ మనసులని మోసగిస్తాయి. అంతకన్నా వాళ్ళ మనసులని వాళ్లు అవమానించుకోవడం మరొకటి ఉండబోదు.

అయినా, నా ఆలోచనల్ని ఎవరూ పట్టించుకోలేదు. అంత చదివిన మా వేనత్త కూడా ఏమీ అనేదు. "మేరేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్" అన్నారు నేను దాన్ని కూడా అట్టే నమ్మను నమ్మలేను.

*　　*　　*

"నీ పెళ్ళికంత తొందరేమొచ్చిందే?" అనడిగాను ఇందిరని సీరియస్‌గా.

"నీ కది అర్థంకాదు" అంది ఆమె అరిందాలా. నాకది కూడా అర్థం కాలేదు. చిన్నప్పటినుండీ ఆమె అంతే.

అన్నీ తనకే తెలిసినట్టు నాకేం తెలియనట్టు మాట్టాడుతుంది. అప్పుడప్పుడు తనకి తెలియని విషయాల గురించి కూడా వాదించి చివరకి ఓడిపోతూ వుంటుంది. ఏది ఏమయినా, ఆడవాళ్ళమనస్తత్వాలని అంచం చేసుకోవటం కొంచెం కష్టమే.

మొదట్లో చాలా అట్టహాసంగా జరగసాగింది. వాకు ప్రత్యేకంగా చెయ్యాల్సిన పన్లేమీ లేకపోవటం చేత నేను పెళ్లిలో ఒక అతిథిలా ఉండి పోవలసివచ్చింది ముహూర్తం వేళ దాకా.

ఆ తర్వాత జరిగిన సంఘటనల వెనకాల 'మాస్టర్ మైండ్' ఎవరిదో తెలియలేదు గాని, నేను మాత్రం బాగా బోల్తాపడ్డాను. జీవితంలో మొదటి సారిగా నా ఆలోచనలకి, కోరికలకి కుదరకపోవటం జరిగింది.

పెళ్ళి సందడి ఫ్లో ఫ్లాష్ కెమెరా తగిలించుకొని ఫోటోలు బోలెడన్ని తీశాను. మరుసటి రోజున వాటిని తీరిగ్గా డెవలప్ చేసి రిజల్ట్స్ కోసం ఆసక్తిగా పరిశీలిస్తున్నాను. చాలా ఫొటోల్లో పెళ్ళి కొడుకు వెనకాల ఉండి, అతని మీదుగా వంగి ఉన్న ఓ పిల్ల నాలో నిద్రపోయిన ఇన్‌స్టింక్ట్‌ని మేల్కొల్పింది

"ఆ పిల్ల పేరేమిటి? ఎవరు?" అని అడిగినప్పుడు జవాబుగా ఇందిర నవ్వి వూరుకుంది. తర్వాత నెమ్మదిగా "ప బంధం కుదర్చమంటావా?"

**కె. ఎస్. గిరిజ**

ఫైనల్ బి. ఎస్‌సి.

కె. వి. ఆర్. వుమెన్స్ కాలేజి,

కర్నూలు

# మల్లి నవ్వు

రెండవ బహుమతి [రు.25] కథ

"థ్యాంక్స్" కిల కిలా నవ్వింది మల్లి. వళ్ళుమండింది రాధకు. ఉరిమి చూసింది మల్లిదిశకు. ఆ చూపులను గమనించని మల్లి అంట్లగిన్నెలు పుచ్చుకొని లోపలికెళ్ళింది రాధ తల త్రిప్పి కృష్ణమూర్తి దిశకు చూసింది. అతను నిర్వికారంగా పళ్ళు తోముకుంటున్నాడు.

తెల్లగా తోమిన చెంబుతో మల్లి కృష్ణమూర్తికి నీళ్ళు ముంచి ఇవ్వటం, అతను థ్యాంక్స్ అనటం, ఆ మాటకు అది కిలకిలా నవ్వటం, దాని కిల కిలలకు దాని గాజుల గలగలలు జత కలవటం - రాధ కాపురానికొచ్చిన ఈ రెండు నెలలలో దాదాపు ప్రతి ఉదయం చూస్తోంది. హద్దూ పద్దూ లేదు దీనికి. ఏమిటీ విగణాటు? రాధకు గొంతుకదాకా కోపంవచ్చేది. ఈ మనిషికైనా శాస్త్రజ్ఞానం వుండొద్దూ? అది నవ్వుతుందని తెలిసీ "థాంక్స్" అనటం దేనికి? బహుశా నవ్వాలనే అంటున్నారేమో? హద్దులు మీరే కోపాన్ని సంస్కారం అదుపులో పెట్టేది

మల్లి గదులు వూడుస్తోంది. కూర్చున్న చోటునుండి వూడ్చిన దిశకు లేచి పోబోయింది రాధ. చేతిలోనుండి పుస్తకం పట్టు దప్పి క్రింద పడింది. మల్లి పుస్తకాన్ని రాధకు అందించింది. 'థాంక్స్' రాధ అప్రయత్నంగా అంది. కిల కిలా నవ్వింది మల్లి. బిత్తర పోయింది రాధ "డోన్ట్ మెన్షన్" అని అర్థమేమో దాని నవ్వుకు?

కానీ ఆమాటకు మల్లి నవ్వటం రాధ కిష్టంలేదు పైగా కోపం కూడాను కోపంమాని, దానినవ్వు ఒక సారి వింటే గులకరాళ్ళమీద పారే సెలయేరు, గాలిలో ఎగురుతున్న చిలకలు, అప్పుడే పూచి, చిరుగాలికి మెల్లిగా కదులుతున్న ఎఱ్ఱ గులాబీలూ తలపు కొస్తాయి.

"అమ్మగారూ!" పూలు కట్టుకొంటున్న రాధ తలెత్తి చూసింది మల్లిని. నాకు "ఇంగిలీషు" నేర్పరా అమ్మగారూ?" దాని కళ్ళలో ఎంత ఆశ. దాని ఆశను అర్థం చేసుకోని రాధ, విసుగ్గా ముఖం పెట్టి "నాకు తెరిపెక్కడుంది?" అంది. మరోసారి అడగకుండా లేచిపోయింది మల్లి. నిజమే రాధకు క్షణంతీరిక వుండదు. వీక్లీలు, మంత్లీలు, ఇంకా లైబ్రరీ బుక్సు, సినిమా పత్రికలు వీటన్నిటినీ చదవటానికే కాలం సరిపోతోంది. వంట పనికి అత్తగారు, పై పనులకు మల్లి వుండనే వున్నారు.

* * *

వెళ్ళిపోయింది. మల్లి తల్లి పనిలోకొస్తోంది. ఉదయం పూట పళ్ళు తోముకొంటుంటే అప్పుడప్పుడు ఎందుకో రాధకు మల్లి నవ్వు వినాలనిపించేది. నాల్గేళ్ళ వరకు సాయంత్రం కాఫీ త్రాగుతూ సిలోన్‌లో పాటలు వినకపోతే ఎలా ఉంటుందో అలా ఉంది పళ్ళు తోముకొంటున్నప్పుడు మల్లి నవ్వు లేకపోవటం.

కృష్ణమూర్తికి నీళ్ళందిస్తే అతను "థాంక్స్" అన్నప్పుడు, కిలకిలా మల్లి తన వెనుక నవ్వినట్లనిపించింది గిర్రున వెనక్కు తిరిగి చూసేది.

పెళ్ళై ఆరు నెలలన్నా గడవకముందే మల్లి పుట్టింటి కొచ్చేసింది సర్వం కోల్పోయి. పాము కరచి మల్లి మొగుడు చనిపోయాడు.

* * *

మ్యాటినీకి టైమవుతోందని హడావిడిగా బొట్టు పెట్టుకొని డ్రెస్సింగ్ టేబిల్ ముందు నుంచి లేచింది రాధ. సిగలోని మల్లెలమాల జర్రున క్రిందకు జారింది. చీపురు పుచ్చుకొని ఇల్లు వూడవటానికి నిలుచుని వున్న మల్లి వంగి మాల నందుకొని రాధ కిచ్చింది "థాంక్స్" రాధ మామూలుగా అనేసింది. కాని మల్లి నవ్వలేదు. థాంక్స్ అన్న మాటకు "డోన్ట్ మెన్షన్" అన్న అర్థంతో అటు వేపు నుంచి నవ్వు వినిపించక పోవటంతో చీరె సర్దు

చూసింది. 'థాంక్స్' ము వినని దానిలా కిటికీలోనుండి కనిపిస్తున్న తులసి కోట కేసి చూస్తూ నిలుచుంది మల్లి కుంకుమలేని నుదురు. బోసి మెడ. గాజులు లేని చేతులు మల్లి జీవకళ కోల్పోయిన ప్రతిమలా వుంది. రాధ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. దేవుడికి కూడా మల్లి నవ్వంటే ఈర్ష్య పుట్టింది కాబోలు. కాని మల్లి నవ్వితే బాగుంటుంది తిరిగి మల్లి నవ్వేదెలా?


ఎమ్. వి. మృదులారాణి
సెకండ్ బి. ఎస్ సి (జడ్ సి. బి.)
గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజి,
అనంతపురం.


మల్లి నవ్వాలంటే ఏంచేయాలి కెమరునాడు మల్లి ఇల్లూడుస్తోంటే వెనకాలే తిరుగుతూ చివరకు ధైర్యం చేసి ప్రశ్నించింది "మల్లీ, నీకు ఇంగ్లీష్ వచ్చునా ?" తలెత్తి రాధ ముఖంలోకి చూసింది మల్లి కాంతిలేని ఆ కళ్ళు రాధను వింతగా చూశాయి. మరోసారి ప్రశ్నించబోయిన రాధ ఆగిపోయింది మల్లి నవ్వగలిగినపుడు సహించలేక పోయింది, నవ్వలేని మల్లిని నవ్వించడానికి ప్రయత్నించి విఫలురాలైంది — రాధ.

***

# మలుపు

రెండవ బహుమతి [రు. 25] కథ

"ఓరే రాములు! ఏందిరా ఇంకా ఇక్కడ్నే ఉండావు. కూల్డబ్బు లెచ్చుకో పోరా" అన్న చంద్రయ్య మాటలువిని కంట్రాక్టరు దగ్గరికి పోయాడు రాములు. వారం రోజుల డబ్బులు ఇరవైయొక్క రూపాయలు రాములు చేతులో పెట్టాడు కంట్రాక్టరు నారయ్య.

"ఓరే రాములు! ఇయ్యాళైనా వచ్చిన కూసిని కూల్డబ్బులు లచ్చికియ్యి. తాగుడికి తగలెట్టకు" అని గదమాయించేడు పక్కనేవున్న వీరయ్యమామ.

"అవును. ఈదినమైనా డబ్బులన్నీ లచ్చి సేతులో పొయ్యాల. ఇయ్యాళ్నుంచి తాగనే కూడదు ఛత్ ఇంత కాలం తను సంపాదించిన డబ్బుల్లో ఒక్క పైసైనా ఇంటికాడ ఇవ్వలేదు పాపం! లచ్చే కష్టపడి కూలి పన్జేసి ఇంటోకి కాత్త బువ్వ తెత్తోంది. ఏం చెయ్యడం మరి తనుగూడ తాగటం మానేద్దామనుకుంటాడు కానీ,

అదే, అదే ఆ మలుపులోనే వుంది, తన వారం రోజుల శెమనీ నిమిసంలో మింగేశక్తి. తాగిచ్చేసి, మూడుముక్కలాటకి పిల్చేసి తన డబ్బులన్నీ గెల్చేస్తారు యెదవలు ఆ పెంద్రయ్య, బంగారయ్యాను. ఆళ్ళ కసలు ఆ కెట్టాడాలో తెల్సు. న్యాయంగా ఆడితే ఆళ్ళ డబ్బులన్నీ నిమిసంలో లాగేత్తాడు తను ఇయ్యాళ ఆళ్ళజోలికి పోనేకూడదు. ఇయ్యాళ్నుంచి మంచోడవ్వాలి. డబ్బులు కూడబెట్టి లచ్చిని సుకపెట్టాలి పాపం! లచ్చెంత కష్టపడుతోందో ఇయ్యాల ఆ మలుపు దాటిపోవాలి. బతుకులోనే మంచి మలుపు తిరగాలనుకున్నాడు రాములు వీరయ్య మాటలకి తలాడిస్తూ

ఆ రోజుకి పనయిపోయింది. చేతులు, మొహం కడుక్కుని చాయ్ తాగి హుషారుగా ఇంటి దారి పట్టాడు రాములు. గబగబ నడిచి వస్తున్నాడు అదిగో. వచ్చే ఆ మలుపే తన డబ్బుల్ని తాగేసే గ. ఆ మూలున్న కొట్లోనే ఆళ్ళిద్దరూ వుండారు. అపుడే పకసీసా యేసి నట్టుండరు యెదవలు ఆళ్ళకి తాగడమె తెలీదు ఒక సీసైనా తాగలేరు. నానైతే – సీసా మీద సీసా అలు సీసాల్లాగేసి తూలకుండా నిలబడ్తా. ఛత్ ఇయ్యాళటు పోనేకూడదు. ఆ యెదవల్తో నాకు జతేంటి. ఈ దినం నుండే తను మంచోడు. తాగడు. మూడుముక్కలాడ్డు. అనుకుంటో ఆ కొట్టువేపే చూస్తూ నెమ్మదిగా మలుపు తిరగబోతున్నాడు

తాములు. కాని చంద్రయ్య, బంగారయ్య చూసేశారు రాముల్ని.

"ఏందిరోయ్, రాములు, మరిచి పోనావేంటి దారి. ఈ దుండాముకోయి. నీ కోపం మూత్తండాము జల్దీరా" అన్నాడు చంద్రయ్య "రారా! ఇయ్యాల్రానను, నేనింక తాగన్రా, నానింకా మీలాంటి యెదవల్తో ఒతకట్టను. పోండిరా, పోండి" అని అరిచాడు.

"ఒరేయ్, ఒరేయ్! ఆడింక తాగట్టురోయ్ పెతిన బూనాట్టు. మనం యెదవలంట సిన్నట్లాడాయే యెదవల్తో తిరిగాడు. ఒరేయ్! రాములు మంచోడై పోగాని ఇయ్యాళకి మత్తరం వచ్చేయ్ కడ్దిగా తాగేసి, రెండు పట్లు పట్టిపో. ఒరేయి! నీకు తెల్దేమో యే సెడ్డపనేనా నెమ్మదిగా మానేయాల. ఇయ్యాలతాక్కుంటే నువ్వు ఏపన్జెయ్యలేవు. నెమ్మదిగా మానెయ్యి రేపట్నుంచి రావద్దులే! రేపు మంచి రోజ్జూసి మానేయరా, మంచోడా!" అంటు ఇద్దరూ కలసి కొట్టు దగ్గరకు లాక్కెళ్ళారు.

"అవును, నెమ్మదిగా మానేద్దాం. ఈ వొక్కరోజేగా. యింకెప్పుడూ తాగొద్దులే. ఇయ్యాల కొంచెం తాగేసి రెండు పట్లు పట్టేం అళ్ళకి రాం! రాం! చెప్పొచ్చేత్తా" అనుకుంటూ చంద్రయ్య అందించిన సీసా తాగేశాడు రాములు. వెంటనే ఆదేచేత్తో బంగారయ్య అందించిన మరో సీసా పూర్తిచేశాడు. ఆమత్తులో మరో సీసా తీసుకొని గబగబా మంచి నీళ్ళలా తాగేశాడు పదేళ్ళనుంచి తాగుతున్న రాములు.

"ఓ రాములు! మంచోడా! ఈ సాలు సాల్రోయి - రా రెండు పట్టేద్దాం ఇలాగ్గా సిదబ్బు గెల్చుకుపో. రేపట్నుంచి నువ్వు మంచోడివే. ఒరేయ్ ఈ మజా ఒగ్గేసి పోయి మంచోడై పోయి యేందిరా సేతాం. సొరగం వొగ్గేసి నరకానికి పోయి మంచోడై యేంజేతావురా రాజా! జల్దీ. రెండు పట్టేద్దాం" అన్నాడు బంగారయ్య.

మొదటి ఆటోనే పోయాడు రాములు ఆ పట్టుదలతో వుండగానే రెండో ఆటలో గెల్చాడు బంగారయ్య. కోపం వచ్చిన రాములు మూడో ఆటలో కూడా ఓడిపోయాడు చంద్రయ్యతో నాల్గో ఆటకి డబ్బులయిపోయాయి రాముడి దగ్గిర.

"ఓరి మంచోడూ! ఇంకింటికిపో.

పి. విజయలక్ష్మి
బి ఎస్ సి ఫస్టియర్ (మేథమేటిక్సు)
క్వీన్ మేరీస్ కాలేజి, మద్రాసు-4

పోయి మంచోడివై పో. సారగంలో నీకింక సోటు లేదు" అన్నారు చంద్రయ్య, బంగారయ్య ఏక గ్రీవంగా. రాములికి కోపం వచ్చింది. కానియేం సేత్తాడు? ఎప్పట్లాగే అప్పుడూ అయ్యింది. "యెదవల్లారా! నన్నిడకి లాక్కొచ్చి నా డబ్బులన్నీ ఖర్చెట్టిచ్చేశారు. యెదవలు" అని యిద్దర్నీ తిట్టి యింటి మొగం పట్టాడు

నెమ్మదిగా తూలుకుంటూ, ఖాళీజేబుల్తో అమవు తిరిగాడు రాములు నెమ్మదిగా గుడిసెకొచ్చి లోపటికి పోయి ఓంకి చాపమీవ పడుకున్నాడు. 'ఏం మావా? కూల్డబ్బులిచ్చారు గందా' అనిలచ్చి యింకా యెదో అడగబోతూ అతని వాలకం చూసి యింక అడగ లేక పోయింది.

లచ్చిని సూడ్డానికే రాములి మత్తొదిలి పోయింది. 'నన్ను సెమించవే లచ్చి! డబ్బులయిపోయాయే. ఇయ్యాల తాగొద్దనుకున్నానే. ఆ యెదవలు లాక్కెళ్ళారే లచ్చి' రెండు చేతులు పట్టేసుకున్నాడు రాములు, ప్రతిసారి వినే మాటలనే అపుడుకూడావింది లచ్చి. రాముల్నేమీ అనలేక పోయింది.

ఆ మాటలు తను చాలా మార్లు వింది. కాని ఒక్కసారి కూడా మావ డబ్బుతెస్తే పాపం మావ కూడ తాగొద్దనుకుంటాడు. కాని యేం చేత్తాడు ఆ మలువులో కొట్టే రాముల్ని సెడ్డోడ్ని సేత్తోంది' అనుకున్నది లచ్చి.

***

# ఈ రాత్రి పారిపోతుంది !

శశాంక

విషకన్యలాంటి రాత్రి
  విషత్తులో ముంచివేస్తుంది నిన్ను !
ఆశల ఆసవాన్ని త్రాగి
అనవసరంగా మత్తెక్కించుకోకు !
నీలాకాశం వంటి
నెన్నడుము సోయగాలను చూసి
నిజమని భ్రమసి పోబోకు !
వాలు చూపుల వయ్యారం చూసి
గాలిలో మేడలు కట్టుకోకు !
అందగత్తెలాంటి రాత్రి
అందరినీ మోసగించి
ఆఖరికి వచ్చింది నీ దగ్గిరకి !
ఈ రాత్రి ఇలాగే నీతో బ్రతుకంతా
నృత్యం చేస్తుం దనుకోకు
గుర్రప్పందెల్లో కోమలాంగిలా వచ్చి
పేకాటలో పెద్దమ్మలా వెళ్ళిపోతుంది
లాటరీలో లావణ్యరాశిలా వచ్చి
బ్రతుకులో పడుపు కత్తెలాగా విడిచిపోతుంది
ఒళ్లు మరచి నిద్రించే నిన్ను
ఒంటరిగా విడిచి
మెత్తని మబ్బులమీద

మెల్లి మెల్లిగా నడిచి
ఎప్పుడో ఒకప్పుడు
నీతో చెప్పకుండా
చడీ చప్పుడూ చేయకుండా
చల్లగా జారి పారిపోతుంది !
ఎప్పుడూ ఈ రాత్రి నీతో బ్రతుకంతా
ఇలాగే కాపురం చేస్తుందనుకోకు
నువ్వెన్ని చుక్కల్ని చల్లి
ఎంతగా ఈ ఆకాశ తల్పాన్ని అలంకరించినా
నీ రాసిక్య హృదయంతో
ఈ రాత్రిని బంధించగల ననుకోకు
ఎప్పుడో ఒకప్పుడు నీకు తెలియకుండానే
ఈ రాత్రి నిన్ను విడిచి లేచిపోతుంది !
చంద్రుడికి వేళ్ళాడదీసుకున్న
చక్కని నీ వెన్నెల వర్ణచిత్రం
చటుక్కున తెగి
గాలి వాలుకి కాలప్రవాహంలో
కొట్టుకుపోతుంది
నీ గది చీకటైపోతుంది
నీ బ్రతుకు వేసటైపోతుంది
ఈ రాత్రి పారిపోతుంది
నీ ఆశ కూలిపోతుంది
ఆకాశం పగిలిపోతుంది
తుది ఘడియలు సమీపించినట్టు
తూర్పుదిక్కు నెత్తురే కక్కుకొంటుంది

# కిశోర ప్రాయం

## విజయలక్ష్మి రామకృష్ణన్

[ గత పంచిక తరువాయి ]

ఆ మరునాడు మధ్యాహ్నం కూని రాగం తీస్తూ ఉబుసుపోక వాకిట్లోకి వచ్చింది వసంత. పెట్టెలు, మూటలు మోసుకుని వెడుతున్న జనాన్ని చూసి ఆశ్చర్యపోయింది.

చెల్లెల్ని పిలిచింది. "అంతా వాళ్లెవరో చూడు" అన్నది నారాయణ రావు యింటి ఎదురుగా కనుమాపు దూరంలో ఎవరో వర్తకులు తాళాలు వేసుకున్న ధాన్యపు కొట్లు వున్నాయి. ఆ ధాన్యపు కొట్ల వరండాలో ఆ జనం వాళ్ళ సామాన్లు దింపుకున్నారు.

సీరియల్

అనంత సంతోషంగా "వాళ్ళు పగటి భాగవతులు. ప్రతి ఏడాది వస్తారీవూరు. ఆ వసారాలోనే దిగుతారు. రెండు మూడు నెలలుండి వెళ్తారు. ఎంత బాగా కథలు చెప్తారో తెలుసా" అంది అనంత.

'కథలు చెప్పడమేమిటి? వేషాలేసుకుని వస్తారుగా' అంది వసంత. "మగవాళ్ళు వేషాలేసుకుని వెళ్తారు ఊరిమీదకు. ఆడవాళ్ళు ఇద్దరిద్దరు కలిసి పాడుతూ కథలు చెప్తారు" అంది అనంత.

వాళ్ళు మాట్లాడుకుంటుండగానే ఆ వచ్చినవాళ్ళు గబగబా సామాన్లు సర్దేసుకున్నారు. మగవాళ్ళు చొక్కాలువిప్పి గోడకు తగిలించి గాలిపోసు[illegible]న్నారు అప[illegible]

ఎదురుగుండా కొబ్బరి చెట్టు క్రింద మూడేసిరాళ్ళు పొయ్యికి పేరుస్తున్నారు చిన్నపిల్లలు చెట్ల క్రింద మట్టులు, పుల్లలు ప్రోగుచేసి వాళ్ళ తల్లులకు సాయం చేస్తున్నారు

ఇంతలో జద్దరాడ ఆళ్ళు బిందెలు తీసుకుని నారాయణరావు ఇంటికి వచ్చారు వాకిట్లో వున్న ఆడపిల్లలను చూసి 'అమ్మగారూ, కాసిని నీళ్ళు పట్టుకుంటామండీ' అనడిగారు

అనంత 'పట్టుకోండి' అన్నది బైటవున్న కొళాయి దగ్గర నీళ్ళు పట్టుకున్నారు వాళ్ళు వసంత జనాన్ని చూస్తూ 'ఆడవాళ్ళే ఎక్కువమంది వున్నారు. మగవాళ్ళు తక్కువే!' అంది

అనంత 'ఉందరూ మరి, ఒక్కొక్కడికి యిద్దరు, ముగ్గురు భార్యలు' అంది. 'నిజంగా' అంది వసంత ఆశ్చర్యంగా. 'ఔను ఒక్కొక్కడికి యిద్దరు భార్యలయితే అక్కడికి తక్కువన్నమాట. అందులో ఒక భార్య చూలింతగానో బాలింతగానో వుంటుంది' అన్నది అనంత అప్పుడే బైటకు వస్తున్న జానకి నవ్వుతూ 'ఏంకబుర్లు అవన్నీ మీ కెందుకు వాళ్ళ గొడవలు' అంది. అనంత నవ్వేసి 'ఊరికేనే తమాషాకు అత్తయ్యా, పోనీ నేను చెప్పింది అబద్ధమా నువ్వే చెప్పు' అంది. జానకి లోపలకు వెళ్ళి పోయింది. అనంత మళ్ళీ మొదలుపెడూ, 'ఒక భార్య యింట్లో అందరికీ వండటం, అందరి పిల్లలను చూడడం'. 'అంద పిల్లలంటే' అంది వసంత 'అంటే తన పిల్లలతోపాటు సవతుల పిల్లలను కూడా చూడాలన్న మాట అయిందా ఇహ. ఇంకో భార్య తంబుర లా, టిది ఒకటి మెళ్ళో కట్టుకని పసిబిడ్డను చంకనేసుకని బయలుదేరుతుంది పాడతూ

## జరిగిన కథ

నారాయణరావు రఘురామ్ బాల్య స్నేహితులు నారాయణరావు కొడుకు వాసు. రఘువరావు కూతుళ్ళు వసంత అనంత. తల్లి పోయినప్పటినుంచి అనంత బందరులో నారాయణరావు భార్య జానకి పెంపకంలో పెరిగి పెద్దవుతుంది గుంటూరులో జానకి అన్నగారి కొడుకు కృష్ణమోహన్‌ను అనంత ప్రేమిస్తుంది కృష్ణమోహన్ చెల్లెలు జగన్మోహిని వాసును ప్రేమిస్తుంది వసంతకు ఎన్నో సంబంధాలు వచ్చినా పెళ్ళి కుదరదు. అనంతను కృష్ణమోహన్ కివ్వడం నారాయణరావు కిష్టంలేదు కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేయలేక పోయానే అనే దిగులుతో రాఘవరావు చనిపోతాడు. చనిపోతూ, కొన్నాళ్ళ తర్వాత చదవమని చెప్పి ఒక కవరును నారాయణరావుకు ఇస్తాడు

ఇంకో ఆడమనిషి వంశపాటకు ఒక మినియేచర్ మృదంగం మెళ్ళో కట్టుకుని తోడు వెళ్తుంది భిక్షకు.



అని పాడుతూ అడుక్కుంటారు. పెద్దవాళ్ళు అర్ధనారీశ్వర వేషం, రాధాకృష్ణుల వేషం వేసుకుని వెళ్తారు. ఇంకా ముసలివాళ్ళు ఒక పంజరంలో చిలకను తీసికెళ్ళి బజార్లలో కూర్చుని చిలక జోస్యం చెప్తారు.

ముసలి ఆడవాళ్ళు తాటాకులతోనూ వెదురుబద్దలతోను బుట్టలు, తడికలు అల్లుతారు. మగపిల్లలు వాటిని తీసి కెళ్ళి అమ్ముకు వస్తారు"

కాస్త రంగు గొంతు బాగున్న మగపిల్లలకు జట్టుపెంచి డాన్సు నేర్పిస్తారు. వాళ్ళు హార్మోనియంతో గొంతుకలుపుతూ 'తీయని వెన్నెల రేయి — ఎదబాయని చిన్నెలహాయి, ఓ రసహాయీ నటనమే బ్రతుకోయీ'

"డివిజన్ ఆఫ్ లేబర్ వాళ్ళకి బాగా తెలుసే! మనలో ఒకడు కష్టపడి సంపాదిస్తే తక్కినవాళ్ళంతా తిని కూర్చుంటారు. వయసుకు తగ్గ పని చెయ్యడంలోనే వాళ్ళకు సుఖమూ నెమ్మదీ" అంది వసంత.

ఆమె ర్నాడు నారాయణరావు షాపు పనిమీద బెజవాడ వెళ్ళాడు. అనంత జానకి దగ్గరచేరి "అత్తయ్యా ఇవాళ మామయ్య వుండరుగా. ఇవాళ రాత్రికి కథ చెప్పించుకుందామా" అనడిగింది. జానకిసరేనని పనిమనిషి తో పాటువాళ్ళకు కబురు పెట్టింది.

ఏడింటికల్లా పాటవాళ్ళు వచ్చారు. జానకి "మీరు గబగబా భోంచేసి రండి వాళ్ళు కాస్త ఆగుతారు" అంది. "ఇప్పుడేం భోజనం అత్తయ్యా" అంది వసంత, "బాగుంది. మీరు కథ వినడానికి ఒక్క కథ అయ్యేసరికి రాత్రి పది పదకొండు అవుతుంది. అప్పటి వరకూ వంటమనిషి మీకోసం కాచుకు కూర్చోవద్దూ" అంది జానకి.

వసంత, అనంత గబగబాభోంచేసి ఇంటి వెనక తులసి కోట దగ్గరకు చేరారు. తులసి కోట అరుగుమీదకూర్చున్నారు ముగ్గురు పాట పాడే స్త్రీలు గౌరమ్మ పార్వతతో మొదలు పెట్టారు. పాడేమనిషికి పసి బిడ్డ. పాతచీరపరచి బిడ్డను పడుకో బెట్టింది. ఎడంచేతి వ్రేళ్ళతో శ్రుతికోసం తంబుర మీటుతూ కుడి చేతి బొటనవ్రేలుకు తొడిగిన రెండు లోహపు రింగులతో తాళం వేస్తూ పాడింది.

"ఏం కథ చెప్ప మంటారండీ" అని అడిగారు. "లక్ష్మమ్మ" కథ తెలుసునా" అనడిగింది జానకి. పాటతో ప్రారంభించారు కథ. లక్ష్మమ్మ పంప వ్నులయింటి ఆడబడుచు. ఎంతో గారాబంగా పెరిగింది. తల్లిదండ్రులకు ఆరవప్రాణం. లక్ష్మమ్మకు వయస్సు రావడం, అప్పుడు జరిపిన వేడుకలు తర్వాత పెళ్ళి చెయ్యడం, అత్తింటికి మేనాలో పంపడం, వెంట పంపిన సారె అన్నిటిని వర్ణించి పాడుతున్నారు. తర్వాత అత్తింటి కాపురం, అత్తా ఆడబిడ్డల దౌర్జన్యం భర్త వేశ్యాలోలుడు కావడం, కడకు లక్ష్మమ్మకు అపవాదు అంటగట్టడం, భర్త చేత చంపించడం, భర్త గుడ్డి వాడవడం లక్ష్మమ్మ పేరటాలయి భర్తకు చూపు ప్రసాదించటం తో కథ ముగిసింది

వింటున్న ముగ్గురి కళ్ళ వెంబడి నీళ్ళు కారాయి. జానకి కళ్ళు తుడుచుకుంటూ "మా చిన్నప్పుడు నేను ఈ కథ సినిమాలో చూశాను. గోపీచంద్ తీశారు" అన్నది

అనంత కళ్ళు తుడుచుకుంటూ "దేశం ఎంత మారింది ? మనుష్యు లెంత బాగుపడ్డారు ?' అంది. పాట పాడినస్త్రీ "కథ చెప్పుకుంటూ ఎన్ని వూళ్ళో తిరిగాం. ఎందరనో చూశాం తల్లీ. ఎవరూ అనలేదు మనుష్యులు బాగుపడ్డారని ! మీరొక్కరు అన్నారు ఆ ముక్క. ఇప్పుడేం బాగండీ ! ఆ రోజుల్లో అంతే లక్ష్మమ్మ లాంటి మహాతల్లులుండే వారు. వాళ్ళు చచ్చిస్వర్గానికెళ్ళినా వాళ్ళ కథలు చెప్పుకుని యీ రోజు

స్త్రీ తనకి పెళ్ళి అయ్యేదాకా భవిష్యత్తు ఏమవుతుందో అని భయపడుతూ వుంటుంది

పురుషుడు పెళ్ళి అయినప్పటి నుంచి భవిష్యత్తు ఎలా వుంటుందో అని బెంగ పెట్టుకుంటూ వుంటాడు.

వరకు బ్రతుకుతున్నాం. ఈ రోజుల్లో పేరంటాళ్ళెక్కడున్నారండీ" అన్నది.

వసంత, అనంత ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు నవ్వు వచ్చింది వాళ్ళకు. వాళ్ళకు చెరి ఒక రూపాయి యిచ్చింది జానకి "పాతచీర ఏమైనా ఇప్పించండమ్మగారూ" అన్నారు వాళ్ళు. "ఈ అర్ధరాత్రెక్కడ వెదకను? ఇంకెప్పుడన్నా కనబడండి" అంది జానకి. వాళ్ళు వెళ్ళిపోయారు ముగ్గురూ లేచి వెళ్ళి నిద్రపోయారు.

రాఘవరావు పోయిన మూడు నెలల తర్వాత ఓరోజు నారాయణరావుకు స్నేహితుడిచ్చిన కవరు గుర్తుకువచ్చింది గదిలోకి వెళ్ళి భార్యను పిలిచాడు జానకి వచ్చింది "తలుపు గడియపెట్టు జానకీ రాఘవరావు పోయేముందు ఈ కవరు నాకిచ్చి, తర్వాత చదవమన్నాడు. ఇన్నాళ్ళూ ఏదో చిరాకుతో సరిపోయింది. రా చూద్దాం, కవరులో ఏమున్నదో" అన్నాడు. కవరు చింపాడు. ఒకటి వీలునామా, రిజిష్టరు చేసింది. ఇంకొకటి ఒక పెద్ద ఉత్తరం.

నారాయణా,

నీకు నన్ను మించిన స్నేహితుడు, నాకు నిన్ను మించిన ఆప్తుడు లేరని మనిద్దరకు తెలుసు. కాని నీ దగ్గర కూడా దాచిన రహస్యం ఒకటున్నది నా జీవితంలో. అది నీతో పంచుకోలేకపోవడానికి కారణం, నేను నీయంత ఉన్నతుడను కాకపోవడమే ఎప్పటికప్పుడే సిగ్గుపడ్డాను నీకు చెప్పడానికి సరే విను – పదిహేనేళ్ళనాటి సంగతి. నా భార్య లక్ష్మిపోయిన నాలుగేళ్ళకనుకుంటాను అప్పట్లో గుంటూరులో శేషాద్రి గారి వ్యాపారంలో పెట్టుబడిపెట్టి వాటాదారుడిగా చేరాను, గుర్తుందా?

అప్పుడు గుంటూరు తరచు వెళ్తూ, వస్తూ వుండేవాణ్ణి. అందుచేత అక్కడ ఒకగది అద్దెకు తీసుకున్నాను ఆ యింటిగలాయన పెద్ద భాగంలో వుండేవాడు. ఆయన రోజు భార్యను కొడుతూండేవాడు ఆవిడ ఏడుపు వేది నాకు మరి నిద్ర పట్టేది కాదు

పట్టలేక ఓరోజు పొరుగువాళ్ళను అడిగాను. వాళ్ళు చెప్పిన కథ. ఆ యిల్లాలు ఆ యజమానికి రెండవ భార్య. ఆయన కూతుళ్ళ

పెళ్ళిళ్ళయ్యాక ఆయన మొదటి భార్య పోయిందట. కొన్నాళ్ళు కూతుళ్ళ దగర వున్నాడట ఈయన పోరు పడలేక అల్లుళ్ళు యింట్లోంచి తరిమారట వండి పెట్టే దక్షత కోసం మళ్ళీ పెళ్ళాడాడట ఎవరో బాకీ వున్న పెద్దమనిషి, ఈయనకు తన కూతురినిచ్చి ప్రోనోటు మీద చెల్లు వేయించుకున్నాడట.

మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకున్న గవాళ్ళు భార్యల అడుగులకు మడుగులు వేస్తారని వింటాం. సవతి తల్లుల కథలలాగానే అవి అన్నీ నిజం గావు భార్య వాకిట్లోకి వస్తే కిటికీ దగ్గర పిలిస్తే, పూలుకొని పెట్టుకుంటే - అనిటికి మండి పడే వాడట భార్య పాతివ్రత్యానికి నిమిష నిమిషానికి పరీక్ష పెట్టే వాడు. రోజూ ఆయన కొట్టడం, ఆవిడ ఏడవడం, సూర్యుడు ఉదయించడం, అస్తమించడ లాగ జరిగేవి. ఉన్నట్లుండి ఒకరోజు ఆయన భోంచెస్తూ ప్రాణం వదిలాడు.

ఇరుగు పొరుగువాళ్ళు 'ముద్దగండం' అన్నారు. కూతుళ్ళు, అల్లుళ్లు వచ్చారు చస్తాడని తెలియదు కనుక ఆస్తి ఎవరి పేరా వ్రాయలేదు కూతుళ్లు యింట్లో వున్న గిన్నెలు, తప్పేలాలు కూడా చెరిసగంగా పంచుకొని ప్యాక్ చేసుకున్నారు అల్లుళ్ళు కొంప కాస్త అమ్మేసి సొమ్ము చెరిసగం తీసుకుని రైలెక్కారు. కుంకుమ చెరుపుకున్న భార్య కట్టు బట్టలతో చెట్టుక్రిందపడింది

నేను చూస్తూ పూరుకోలేకపోయాను 'ఇల్లంతా వాళ్ళు తుడిచి పెట్టుకు పోతుంటే మీరెందుకు మెదలకుండా వూరుకున్నారు' అనడిగాను. ఆమె 'అడిగాను. కూతుళ్ళిద్దరు' నిన్ను మానాన్న చేసుకున్నట్లు ఏమిదాఖలా? సాక్ష్యం చూపించు. కోర్టుకురా, గెలుచుకుని అన్నంతా పట్టుకుపో' అన్నారు. నా పెళ్ళికి సాక్ష్యం మా నాన్న, మా పూరి వినాయకుడి గుళ్ళో అర్చకుడు తప్ప ఎవరూ లేరు ఒకరాత్రి మానాన్న నన్ను గుడిదగ్గరకు తీసికెళ్ళాడు. అర్చకుడు యిచ్చిన పసుపు దారాన్ని నా మెళ్ళో కట్టించాడు, తన బుజాదాతతో. ఆ రాత్రే నన్ను ఆయనతో పంపించాడు నేను ఏడిస్తే 'పిచ్చిగంగా, యిది పెళ్ళి కాదుటే? కులమందరిని పిలిచి విందు చేస్తేనే పెళ్ళా? దాని కెక్కడ అప్పతీసుకురాను? తెస్తే అది ఎట్లా తీరుతుంది' అన్నాడు కోర్టుకు ఎట్లా వెళ్ళాను నేను?' అన్నదామె 'అన్నదమ్ములు ఎవరూ లేరా, వాళ్ళ దగ్గరకు వెళ్ళండి' అన్నాను నేను. ఆమె ఏడుస్తూ 'నాపిడోపిట నా తల్లి పోయింది, మానాన్న యింట్లో మా అమ్మ నగలు, పాత్ర సామాను కాకట్టు పెట్టి, అమ్మి త్రాగుతుండే వాడు. గుళ్ళోను, చెట్టుక్రింద చీట్ల పేక ఆడేవాడు. ఇద్దరన్నయ్యలుండే




వారు వాళ్ళను బడికి పంపలేదు నాన్న. ఇంట్లో తిండి ఖర్చుకి కూడా యిబ్బందే జొన్న నూకలు చాలేది కాదు. అదే గంజి కాచే దాన్ని ఒకనాడు అన్నయ్యలు ఆకలితో మండి నాన్నతో పోట్లాడారు. నాన్న కోపం పట్టలేక వాళ్ళను గొడ్డును బాదినట్లు బాదాడు. కమిలి వాతలు దేరిన ఒళ్ళుతో వాళ్ళు యిల్లు విడిచి వెళ్ళిపోయారు. మళ్ళీ తిరిగి రాలేదు' అన్నది.

తన్ను శరణాలయంలో చేర్పించమని అడిగింది. రాజమండ్రి పిల్చుకు వెళ్ళాను. మూడు రోజులు తిరిగాను. శరణాలయంలో చేరడానికి ఎవరెవరి సిఫార్సులో కావాలట. అవి నేను తీసుకు రాలేక కాదు, కాని అసహ్యమేసింది. గోదావరి గట్టు తొక్కిన ఫలమో ఏమో నాకు హఠాత్తుగా 'ఆమెను ఎందుకు పెళ్ళాడకూడదు' అనే ఆలోచన వచ్చింది. ఆమెకు చెప్పాను. తెల్లబోయింది భయంతో భోరునఏడ్చింది.

అభీరువును చూస్తే నా కోరిక యింకా బలమైంది. శరణాలయం ఆలోచన కట్టిపెట్టి, రాజమండ్రిలోనే ఒకయిల్లు తీసుకుని గంగను వుంచాను. తోడుకు ఒక పనిమనిషి నిచ్చాను నారాయణా, నేను నిజంగా ఆమెను పెళ్ళి చేసుకునే ఉద్దేశంతోనే అన్ని ఏర్పాటూ చేశాను. కాని చివరి ఘడియలో నాకు స్వార్థం కమ్మింది నా బంగారు కూతుళ్ళ భవిష్యత్తు ఏమవుతుందో నని భయపడ్డాను.

మనసులోమాట దాచుకోకుండా ఆమెకు చెప్పాను. గంగ నన్ను నిందించలేదు. నన్ను అసహ్యించుకోలేదు. నన్నర్థం చేసుకుంది. నన్ను క్షమించింది. పెళ్ళిలేకుండానే కలిసి

బ్రతికాం. గంగ కాపు సర్వసుఖాలు ఇచ్చింది. ఆ రెండో ఏట గంగకు కొడుకు పుట్టాడు. నాకు వాడే మొదటి కొడుకు నా సంతోషం ఎవరితోనూ పంచుకోలేక విచారించాను. వాడే హరికృష్ణ. రాజమండ్రిలో నే పి. యు. సి. చదువుతున్నాడు. హఠాత్తుగా జబ్బుచేసి మంచంపట్టినప్పుడు గంగకు జాబు వ్రాశాను. ఉండబట్టలేక హరిని కూడా వెంట పెట్టుకువచ్చింది. నువ్వు చూచావు వాళ్ళను. గుర్తుందా నీకు? కులం కాని స్త్రీతో, అందులో విధవతో, పెళ్ళిలేని కాపురం చేసిన మనిషిని మన సంఘం క్షమిస్తుందా? వాడి కూతుళ్ళకు పెళ్ళిళ్ళవుతాయా?



సంఘ భీతివల్లనే గంగ మొదట అతి దారం చేశాను. ఆ పాప ఫలితమే ఎంత ప్రయత్నించినా, నా కూతురికి నాచేత్తో పెళ్ళి చెయ్యలేక పోయాను. కొడుకును కలిగివుండి వాడిచేత్తో సంస్కారం పొందలేక పోయాను.

ఇహ నా ఆస్తి సంగతి. మా తండ్రి ఇచ్చిన ఆస్తిని అమ్మి బ్యాంకులో పెట్టానుకదా! వసంత నీ బిడ్డగా పెరిగింది దానికి నా ఆస్తిలో భాగం పెట్టి నిన్ను చిన్నబుచ్చలేక పోయాను. ఉన్న స్థిరాస్తి అంతా వసంతకే వ్రాశాను.

అక్కడక్కడా ఫ్యాక్టరీల్లో షేర్లు వున్నాయి. అవన్నీ హరికృష్ణకు వ్రాశాను. ఇన్సూరెన్సు పాలసీ నెల నెలా ఐదువందలు వస్తుంది గంగకు. హరి చదువయ్యేంతవరకు అవి చాలు. రాజమండ్రిలో [illegible] హరికి వ్రాశాను. లాయరు కృష్ణమూర్తి గారికి అన్ని వివరాలూ తెలుసు. వసంత, ఆనందల పెళ్ళిళ్ళయ్యేవరకు నా గుప్త చరిత్ర [illegible]. జీవితంలో కష్టాలు వచ్చినవి నాకు. వాటి బరువు మోసింది నువ్వు. ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేసే బాధ్యత నీమీదే పెట్టిపోతున్నాను. నువ్వు నన్ను క్షమించలేవని తెలుసు క్షమించగలిగితేనే నీకు మనశ్శాంతి అని తెలుసు. ఆ శక్తి నీకు కలగాలని కోరుకుంటున్నాను. భార్యగా [illegible] నన్ను, నా పిల్లలను కూడా తల్లిలాగ ఆదరిం

బించి. ఆ అన్నపూర్ణ ఆదరణలోనే నా బిడ్డలను వదిలి నిశ్చింతగా చచ్చిపోతున్నాను

నీ
రాఘవ

ఉత్తరం ముగించిన నారాయణరావు దిగ్భ్రాంతుడయ్యాడు. ప్రక్కన కూర్చుని చదివిన జానకి తెలతెలా బోయింది. "ఎంతటి చింత? మన కెప్పుడూ అనుమానమైనా రాలేదు. లోకంలో అపవాదులంటివి యింటింటికి వ్యాపిస్తాయి. నిజంగా జరిగిన విషయం ఆప్తులకుకూడా తెలియలేదు! మీకు గుర్తుందా పదిహేనేళ్ళ క్రితం లక్ష్మి పోయిన నెల రోజులకు ఈ గదిలోనే మన సంసారంలో ఒక అధ్యాయం ముగిసింది!" అన్నది జానకి.

నారాయణరావు జాలిగా భార్య వంక చూసి ఆమె భుజం మీద చెయ్యేసి 'జానకీ ఆ రోజు ఎట్లా మర్చిపోతాను నేను? నేను నేనుగా బ్రతికి వున్నందుకు కారణం నువ్వు. నేను కాదు. నా కోరికలు ఎంత అసహజమైనవైనా ఆదరించావు నువ్వు. జానకీ! నాకు దేవుడి మీదా, స్వర్గం మీదా, పునర్జన్మల మీద నమ్మకం లేదు కాని ఆ నమ్మకాలు యిప్పుడు కలగాలని ఆశగా వుంది. నాకు అవన్నీ నిజమే అయితే జానకి, నన్నే జన్మలోనూ విడిచి పెట్టకు" అన్నాడు.

జానకి హృదయం ద్రవించి పోయింది. "సరి యింక వూరుకోండి' అంది. "లేదు నే నన్నది అడ్డు పెట్టకు. లక్ష్మి పోయిన తర్వాత నే నాకు సంసార సుఖమంటే వైముఖ్యం కలిగింది." "ఔను. నన్ను చేతుల్లోకి తీసుకుని చటుక్కున వదిలేసేవారు! ఒక్కోసారి నా ఒళ్ళు దహించుకు పోయేది ఈర్ష్యతో" అంది జానకి. 'ఈర్ష్య - అదేంటి జానకీ"

"ఔను ఈర్ష్య కాక మరేమిటి? మీ స్నేహితుడు కోల్పోయిన సుఖం మీరూ వదులుకున్నారు! ఆ స్నేహితుడి మీద వున్నంత ప్రేమ

ప్రతిరోజు పావుగంట లేటుగా ఆఫీసుకి రావటం గుమాస్తాకి అలవాటు. మేనేజరు ఎన్నిసార్లు చివాట్లు పెట్టినా లాభంలేక పోయింది. విసుగుపుట్టి ఓపనాకి, "నిన్ను ఒక రోజు జీతం నష్టంమీద సస్పెండు చేస్తున్నాను, నీయిష్టం వచ్చిన రోజున ఈ సస్పెన్షన్ వాడుకోవచ్చు" అని మేనేజరు చాలా మర్యాదగా నోటీసిచ్చాడు.

దానికి గుమాస్తా "మీ అభ్యంతరం లేకపోతే ప్రతిరోజూ పావుగంట లేటుగా రావడానికి మీ సస్పెన్షన్ వాడుకుంటాను" అని జవాబిచ్చాడు

నా మీద మోజు లేదని మండిపోయే దాన్ని' అంది.

'...నకీ, మీ అరవాళ్ళంత సెంటిమెంటల్‌గా మగవాళ్ళందరు ఉన్నా నేను దగ్గరకు తీసుకున్నప్పుడల్లా నాకు నా స్నేహితుని అవస్థ గుర్తుకు వచ్చేది కాదు. వాడి భార్య అవస్థ గుర్తుకు వచ్చేది. అందుకే వదిలేసేవాణ్ణి నిన్ను' అన్నాడు.

'అదేమిటి' అంది జానకి. 'నాను పుట్టినప్పుడు నువ్వు ఒక రోజంతా కష్టపడ్డావు. లక్ష్మి కాన్పులోనే చచ్చిపోయింది. నిన్ను ఎక్కడ పోగొట్టుకుంటానో అనే భయం వేసింది. ఆ రోజుల్లో నాగరికత యింతగా పెరగలేదు. సృష్టి రహస్యం ఈ రోజుల్లో వయస్సులో వాళ్ళకు సులభమైపోయింది. ఆ రోజుల్లో అంత ప్రచారమూ లేదు. ఎక్కడో పుస్తకాల్లో ఏముక్కైనా చదివినా అది ఎబ్బెట్టుగా తోచేది. అంతేకాదు. సరిగ్గా ఆ రోజుల్లోనే గాంధీగారి ఆత్మకథ చదవడం తటస్థించింది. ఆ పుస్తకం అంత వయసు వచ్చేవరకు ఎందుకు చదవకుండా వున్నానో తెలియదు. దానిలో తండ్రి ప్రాణ ప్రయాణ వేళకూడా తన్నావహించిన కోరిక గురించి ఎంతో సిగ్గుగా వ్రాశారాయన. అది చదివి నేను నిజంగా జడిసిపోయాను.

కోరికలు కలుపుమొక్కల్లాంటివి. వాటిని పెరగనిస్తే చివరకు మనిషి మిగలడు నన్ను నేను మానవమనిషిగా నిరూపించి పరీక్షించాలన్న కుతూహలం కలిగింది ఆ ఫలితమే ఆరోజు అన్నను నీతో "ఇహమీదట మనం దంపతులుగా కాక స్నేహితులుగా వుందామని" అన్నాడు నారాయణ రావు

జానకి "మీరట్లా అనగానే నా గుండె ఝల్లుమంది విచిత్ర మేమంటే ఆ ఏడాదే నేను శారదాదేవి చరిత్రం చదివాను మీ కోరిక కాదనలేకపోయాను కారణం ఏదయినా మీరు పరమహంస లాగ నిగ్రహం చూపగలిగితే నేను అల్పబుద్ధితో మిమ్మలను క్రిందకు లాగకూడదనుకున్నాను" అన్నది

నారాయణరావు నవ్వి "నువ్వు నన్నెప్పుడూ గొప్పగానే వూహించావు కోరికను జయించినవాడు పరమహంస నేను స్వార్థం కారణగానే కోరికను అణుచుకున్నాను నేను వట్టి మామూలు మనిషిని జానకీ" అన్నాడు జానకికి భర్త ఎప్పుడూ మామూలు మనిషిగా తోచలేదు "పూజకొద్ది పురుషునన్నట్లు" తన జన్మజన్మల పుణ్యమే భర్తగా లభించినట్లు నమ్మింది.

జానకీ నిజంగానే నువ్వు మనస్ఫూర్తిగా ఒప్పుకున్నావా? నీకు ఎప్పుడు మనసు చలించలేదా? ఎన్నోసార్లు నాకు మనసు గాడి తప్పేది శక్తి అంతా కూడదీసుకుని నిగ్రహించుకునేవాణ్ణి" అన్నాడు నారాయణరావు.

జానకి సిగ్గుపడి పోయింది. "మీతో అబద్ధమెప్పుడు ఆడలేదు నేను. చాల సార్లు నా మనసు చలించింది. సుఖం మీద కోరిక వున్నాట్టే బాధపెటలేదుకాని నాకు ఒక కూతురు కావాలనే కోరిక కలిగేది అప్పుడప్పుడు చిన్న పిల్లకు పట్టు లంగాలు కట్టాలని, కాళ్ళకు వెండి మువ్వలు కట్టాలని, నానగలన్నీ పెట్టాలని పొస్తెపూలు, మొగలి రేకులు చూసినప్పుడల్లా నాకు కూతురుండి; ఆ కూతురుకు పూలజడలు కుట్టాలని కోరికలు కల్గేవి కాని మళ్ళీ అనుకునే దాన్ని. కూతురుపుడితే అవంతమీద ఆపేక్ష తగ్గిపోతుందేమోనని. నా మీద నాకే సంశయం కలిగేది. ఆ భయంతో నా కోరికను చంపుకునే దాన్ని. అవతకు మీరు నగలు పెట్టనిచ్చేవారుకాదు పూలజడలు వెయ్యనిచ్చేవారు కాదు. ఎంబ్రాయిడరీ నేర్పించారు కాదు? నా కోరికలు తీరని కోరికలే అయ్యాయి" అంది జానకి.

నారాయణరావుకు భార్యమీద నిజంగా జాలి పొంగివచ్చింది "జానకీ మనిద్దరి మధ్య ఎంత దూరం వుండికూడా మనం ఎంత సన్నిహితంగా బతికామో తలుచుకుంటే వింతగా లేదూ? ఐహిక బంధాలు లేకపోయినా మధుర స్నేహమే మనిద్దరికి శాంతి నిచ్చింది. నవయిుంటివి కాపాడింది. సరే వెళ్ళి నాక్కాస్త కాఫీ పట్టుకురా? ఈ కవరు ఇనప్పెట్టెలో పెట్టు. ఎవరికి తెలియనివ్వకు" అన్నాడు నారాయణరావు జానకి లేచి వంటింట్లోకి వెళ్ళింది.

ఆ ఏడాది పరీక్షలు బాగా వ్రాసింది

అనంత ఇంకో ఏడాది చదివితే మొదటి డిగ్రీ వస్తుంది" అనుకుంది. వామకు ఉత్తరం వ్రాసింది. "నీకు పరీక్ష లెప్పుడు? ఇంటికి ఎప్పుడు వస్తావు? కలకత్తా మీదుగా వస్తా వన్నావు ఈసారి రసగుల్లా డబ్బాలు మర్చిపోకు" అని వ్రాసింది. అంతలోనే పోస్టు వచ్చింది. జానకి ఆ వుత్తరం చదువుకుని "అయ్యో. మోహినికి చాల జబ్బుగా వుందట! అన్నయ్య రమ్మని వ్రాశారు" అంది. నారాయణరావు "ఏం జబ్బట" అన్నాడు. అనంత కంగారుపడుతూ జానకి చేతిలో వుత్తరం తీసుకుని చదివింది. వివరాలేమీ వ్రాయలేదు.

"ఎప్పుడెళ్తా వత్తయ్యా" అడిగింది అనంత. "సాయంత్రం నాలుగింటికి ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్ వుంది దాంట్లో వెళ్ళు" అన్నాడు నారాయణరావు.

జానకి "అనంతా రెండు చీరలు పెట్లో వెయ్యమ్మా" అంటే అక్క చెల్లెళ్లిద్దరు బట్టలు సర్దడానికి వెళ్లారు. వసంత సూట్‌కేసు తెరిచి అడుగున న్యూస్‌పేపర్ మార్చి నాలుగు నాఫ్తలీన్ వుండలు వేసింది. అనంత తెచ్చిన బట్టలు పెట్టెలో పెడుతూ "నీ చీరలు కూడా తెచ్చావు. నువ్వూ వెళ్తావా అనంతా" అడిగింది. "అవునక్కా, కబురు తెలిశాక నాకు దిగులుగా వుంది. ఏం జబ్బో ఏమిటో? నువ్వు మోహినిని చూడనే లేదు కదూ? నాకు మోహిని అంటే ఎంత ప్రాణమో నీకు తెలీదు" అంది అనంత. వసంత ఏమీ మాట్లాడలేదు.

చెల్లెలి భావోద్వేగాలు ఆమె కంటె బాగా తెలుసు. అనంత మనసు "వజ్రాదపి, కుసుమాదపి" కూడ. జానకి వెంట బయల్దేరిన అనంతను చూచి "నువ్వెందుకు అనంతా" అన్నాడు నారాయణరావు. "వస్తానంది, రానివ్వండి, కాలేజి సెలవలేగా దానికి. నాకు ఒంటరిగా వెళ్ళడానికి కాళ్ళాడ్డం లేదు" అంది జానకి.

నారాయణరావు మాట్లాడలేదు. కాని అతనికి అనంత గుంటూరు వెళ్ళడం యిష్టం లేదు. ఆ సంగతి తెలిసి కూడా ప్రయాణమయింది అనంత.

ఆ రాత్రి గుంటూరు చేరేప్పటికి మోహిని నిద్రపోతోంది. మోహిని తల్లి కమల ఏడుస్తూ "వదినా. నెల రోజుల నుంచి యింట్లో వుండలేక పోతున్నాను. మొదట జ్వరం, తర్వాత కామెర్లలోకి దింపింది. త్వరగా తెలుసుకోలేక పోయారు. ముందు తెలిసి వైద్యం మొదలెట్టాక జబ్బు తిరుగుముఖం పట్టలేదు. పదిమంది డాక్టర్లు చూశారు. నా తల్లి ఎప్పటికి లేచి నట్టింట్లో తిరుగుతుందో? నాకు పిచ్చెక్కి పోతోంది. మొన్ననే మీకు మెడ్రాసుకు మా వదినకు వ్రాశాము" అని కళ్లు తుడుచుకుంటూ, "రండి కాళ్లు కడుక్కు రండి భోంచేద్దురుగాని" అంది. ఎవరికి భోజనం సహించలేదు. అనంత మోహిని గదిలోకి వెళ్ళింది. కృష్ణమోహన్ అక్కడే పడుకున్నాడు.

[సశేషం]

# ప్రముఖుల




శరత్ పేరు తెలియని వారుండరు. అతని పేరుతో ఉన్న వేరొక రచయిత కూడా అతని కాలంలోనే రచనలు చేసే వాడు ఒక శరత్ చంద్రుడు ఒక పాత స్నేహితునితో కలిశాడు. ఆ స్నేహితుడు తొందరగా ఇతన్ని గుర్తించలేదు.

"ఏమింకా గుర్తించలేదా? నేను శరత్‌చంద్రుణ్ణి"



"శరత్ సాహిత్యంలో ఇద్దరు చంద్రులు ప్రకాశిస్తున్నారు. నీవే శరత్ చంద్రుడవు?"

"నేనా? చరిత్రహీన శరత్ చంద్రుణ్ణి"

* * *

హిందీకవి బాలకృష్ణశర్మ తన కవిత్వంలో సజనీ, సఖి, రాణీ అని ఎక్కువగా ఉపయోగించేవాడు.

ఆచార్య మహావీర ప్రసాద్ చతుర్వేది శర్మను "నీ వెందుకు నీ కవితలలో రాణీ! సఖీ! సజనీ! అని



ఎక్కువగా వ్రాస్తావు? అసలు ఆమె ఎవరు?" అని అడిగాడు.

బాలకృష్ణశర్మ చతుర్వేది గారిని తండ్రిలా గౌరవించేవాడు అయినా ఆ ప్రశ్న వారడిగినందుకు 'మీరిప్పుడు ఆమె విషయం తెలుసుకుని ఏం చేస్తారు? వృద్ధులయ్యారు మీకెందుకు లెండి" అన్నాడు బాలకృష్ణశర్మ.

* * *



విశ్వవిఖ్యాతి చెందిన దాంతేకవితో ఒకరాజు ఇలా అన్నాడు

"నా ప్రజలు మిమ్ముల నసహ్యించుకుంటారు. నాలాంటి మూర్ఖుణ్ణి ప్రేమిస్తారు ఎందుకు?"

"నిజమే రాజా! ప్రజలు తమలాంటి వ్యక్తినే ప్రేమిస్తారు. అందుకే యథారాజా తథాప్రజా అన్నారు" అన్నాడు దాంతే కవి.

* * *

ప్రసిద్ధ ఫ్రెంచి రచయితలు విక్టర్ హ్యూగో, అలెగ్జాండర్ డ్యూమా ఒకసారి కలిశారు. మాటలలో డ్యూమా ఇలా అన్నాడు 'మనమిద్దరమూ కలసి ఒక



మంచి నవల వ్రాస్తే బాగుంటుంది కదూ,"

హ్యూగోకి ఇది నచ్చలేదు.

"ఎక్కడైనా గాడిద, గుఱ్ఱమూ కలుస్తాయా?" అన్నాడు

దానికి డ్యూమా వెంటనే ఇలా జవాబిచ్చాడు

"దయచేసి నన్నుమాత్రం గాడిదగా భావించకండి"

* * *

ఎల్ సాయిడ్ డి గాస్పెరీ ప్రధాన మంత్రి అయినప్పుడు ప్రెస్ పత్రికా విలేఖరి ఇంటర్వ్యూకు వచ్చాడు



"ఇది నా ఆఖరి ప్రెస్ ఇంటర్వ్యూ! నేనిప్పుడు 65 వ సంవత్సరంలో వున్న వృద్ధుణ్ణి రిటైరవుతున్నాను" అన్నాడు విలేఖరి.

దానికి ఎల్ సాయిడ్ డి గాస్పెరీ "విచారించదగ్గ విషయమే నేనుకూడా 65 సంవత్సరాల వృద్ధుణ్ణే అయి నేనిప్పుడు క్రొత్త పదవిని చేపట్టడానికి వెళుతున్నాను" అన్నాడు.

—పి నాగేశ్వరరావు

# తమాకి తెలిదా ఏమిటి?

1) పూర్వకాలంలో ఒక వ్యాపారస్తుడు ఏనుగులు గుర్రాలు మేకలు అమ్మేవాడు అయిదు తులాల బంగారం పెడితే ఒక ఏనుగు వస్తుంది ఒక తులం బంగారానికి ఒక గుర్రం వస్తుంది ఒక తులం బంగారమిస్తే పది మేకలు వస్తాయి

ఒకడు వంద తులాల బంగారం పట్టుకుని వ్యాపారస్తుడి వద్దకు వెళ్ళి మూడు రకాలవి మొత్తం వంద జంతువులు కావాలన్నాడు. వ్యాపారస్తుడు ఏ లెక్కన అమ్మితే వంద తులాలకి మూడు రకాల్లోను మొత్తం వంద జంతువులు వస్తాయి ?

వి. గోపాలకృష్ణ, విజయనగరం

2) ఒక బుట్టలో మొత్తం 154 పువ్వులున్నాయి. వాటిలో ఎర్రటి పువ్వులకంటె నీలం పువ్వులు మూడు తక్కువ కాని, పచ్చని పువ్వులకన్న నీలం పువ్వులు అయిదు ఎక్కువ. అయితే ఎర్ర పువ్వు లెన్ని ?

కె. రాఘవేంద్రరావు, హైదరాబాదు

(జవాబులు [దిగువ] కిందుగా వున్నాయి)

తమకు తెలికపోతే జవాబులు

1) ఈ విధంగా అమ్మితే వందతులాల బంగారానికి వందజంతువులు మూడు రకాలవి వస్తాయి:

90 తులాలకు — 18 ఏనుగులు

8 ,, — 80 మేకలు

2 ,, — 2 గుర్రాలు

2) ఎర్ర పువ్వుల సంఖ్య 55

విశ్వం పుట్టి (విద్వాన్ విశ్వం గారు గాని, ఆరిపిరాల విశ్వంగారు గాని, డైరెక్టరు విశ్వంగారు గాని కాదని మనవి) వెయ్యికోట్ల ఏళ్ళు అయిందని మొన్నటిదాకా సైంటిస్టులు అనుకునేవారు కానీ వారు చాలా దారుణంగా మోసపోయారు

నిజంగా విశ్వం పుట్టి (విద్వాన్ వి కాదు) ఏడు వేల కోట్ల ఏళ్ళు అయిందని ఈ మధ్యనే సోవియట్ సైంటిస్టులు కనిపెట్టారు

ఇది వింటే మీకు ఈ జోకు జ్ఞాపకం రావడంలేదూ? వెనకటి కొక సైంటిస్టు ఒక సభలో మాట్లాడుతూ మన భూగోళం ఇంకో అయిదు వందల కోట్ల ఏళ్ళలో మాడి మసైపోతుంది అన్నాడు




సభలోనుంచి ఒక బాబ్జీ అదురాగా "ది ఎన్నేళ్ళు?" అని అడిగాడు

"అయిదువందల కోట్ల ఏళ్ళు!" అని సైంటిస్టు మళ్ళీ చెప్పాడు.

"అయిదువందలా? నాలుగు వందల కోట్ల ఏళ్ళని వినబడితేను గాభరా పడ్డాను" అని కూర్చున్నాడు బాబ్జీ

విశ్వం పుట్టి వెయ్యి కోట్ల ఏళ్ళు అయినా ఏడువేల కోట్ల ఏళ్ళయినా మన ప్రాణానికి ఒకటే కదూ?

* * *

వెదురు గుజ్జు ఉపయోగించి కాగితాన్ని తయారు చేయడం మొదటగా చైనావారు క్రీస్తుశకం 105లో కనిపెట్టారు

* * *

12345679 అనే అంకెని 999999999 తో హెచ్చవేస్తే 12345678987654321 వస్తుంది

* * *

గాలిలో వున్న నీరంతా భూమి మీద పడడం మళ్ళీ ఆవిరై గాలిలోకి పోవటం సగటున ప్రతి

పన్నెండు రోజులకి ఒకసారి జరుగుతుంది

* * *

1965లో ప్రపంచం మొత్తం మీద పట్టుకున్న చేపల బరువు 5కోట్ల 24 లక్షల టన్నులు

* * *

భూమి ఉపరితలం మీద నూటికి 71 వంతుల ప్రదేశం నీటి మయం

* * *

ఎంత అంద వికారంగా వున్న వాళ్ళయినా సరే, ఎవళ్ళ ముఖం వాళ్ళకి అద్దంలో చూసుకోగా చూసుకోగా బావుంటుంది అందుకే అద్దాల్ని కనిపెట్టిన వాడు ఆదిమ మానవుడు తన ముఖాన్ని తాను నిశ్చలమైన నీళ్ళలో చూసుకునేవాడు ఆ దరిమిలా ప్రేయసి కనుపాపలోను, చెక్క ఒద్దాల్లోనూ చూసుకోవడం మొదలు పెట్టాడు కాని అసలైన అద్దాలు క్రీస్తు పూర్వం వెయ్యి సంవత్సరాల నాటికే వాడుకలోకి వచ్చాయి ఆ రోజుల్లో అద్దాలని బాగా పాలిష్ చేసిన కంచుతో తయారు చేసేవారు

* * *

సముద్ర జలంలో నూటికి మూడున్నర పాళ్ళు ఉప్పు వుంటుంది

* * *

శనిగ్రహానికి తొమ్మిది మంది చంద్రుళ్ళు వున్నట్లు మొన్నటి దాకా శాస్త్రవేత్తలు అనుకునేవారు కాని, ఈ మధ్య ఒక ఫ్రెంచి అస్ట్రానమర్ పదో చంద్రుణ్ణి కనిపెట్టాడు. అది 18 గంటలకో సారి శనిగ్రహాన్ని చుట్టి వస్తుంది దాని వ్యాసం మూడు నుంచి రెండు వందల మైళ్ళ వరకు వుంటుంది

మన ప్రబంధ కవుల వర్ణన ప్రకారం భూమిమీద విరహిణీ స్త్రీలు ఒక్క చంద్రుడి తాపానికే తాళలేక కింద మీదయ్యేవారు ఇక శని గ్రహంలోని అమ్మాయిలు (?) పదిమంది చంద్రుళ్ళతో ఎంత గగ్గోలెత్తి పోతున్నారో పాపం ! అయినా, శని జోలి మన కెందుకు లెండి

—బాబ్జీ

***




# వసంతసేన

సాహిత్య, చలనచిత్ర కళాభిమానుల కు మేధకు, కంటికి, కర్ణానికి విందు "వసంతసేన."

లోగడ మూకీల కాలంలో ఏణాక్షి రామారావుతో. హిందీలో వనమాలతో వసంతసేన తీశారు.

తెలుగులో ఎన్నో ప్రాచీన సాహితీ కుసుమాలు వెండితెరపై వికసించాయి కాని, "మృచ్ఛకటికం" వంటి గొప్పనాటకం తెర నలంకరించక పోవడం లోటుగా వుంది.

ఇన్నాళ్ళకు విక్రమ్ రంగా ఈ కొరత తీర్చారు. తెలుగు మార్కెట్ కు అందుబాటులో లేని కలర్‌లో — ఈస్ట్‌మన్ కలర్‌లో — కూడా తీశారు. ఏ తెలుగు నిర్మాతా భరించలేని హిందీ బిగ్ బడ్జెట్ కళా దర్శకుడు సుధేందు రాయ్ ని నియోగించడం కూడా మరొక విశేషం.

పద్మినివంటి నాట్యకత్తె వసంతసేన పాత్ర ధరించడం, నాగేశ్వర రావువంటి ఉత్తమ విషాద, శృంగార పాత్రధారి చారుదత్తునిగా నటించడం పోను పోను చిత్రానికి రసపుష్టి ఇచ్చింది.

శూద్రక మహారాజు క్రీస్తుశకం 120 ప్రాంతంలో రచించిన 'మృచ్ఛకటికం' అనే పది అంకాల సంస్కృత నాటకం ఈ చిత్రానికి ఆధారమైంది. కథా స్థలి ఉజ్జయినీ.

ఈ మూల కథను సినిమాకు అనుగుణంగా మలచారు. సంస్థానకుడు అనే శకారుని (రంగారావు) పాత్ర మరింత ఆకర్షకంగా రూపొందించారు. మూలంలోని తిరుగుబాటు అంశాన్ని చారుదత్తునికి కలిపి ఆ పాత్రకు శక్తి తెచ్చారు.

వసంతసేన నాట్యాలు, చారుదత్తుని దాతృత్వం, నేరస్థుడు కాకపోయినా, బలిపీఠానికి వెళ్ళడల

శతం కరుణాత్మకంగా చిత్రీకరించారు. ఆయా సందర్భాలలో నాగేశ్వరరావు నటన వన్నె కెక్కింది. ఈ కొత్త పాత్ర అయిన అనంగ సేనగా కృష్ణకుమారి ఎలిజబెత్ టైలర్ ఫ్యాషనులో గ్లామరస్‌గా వున్నారు. మూడు నాలుగు పాటలు ప్రజలను ఆకట్టుకొంటాయి.

## “పూలరంగడు” పతాక సన్నివేశం

అన్నపూర్ణా పిక్చర్స్ వారి ‘పూలరంగడు’ రీరికార్డింగ్ ఈ సంచిక వెలువడేసరికి పూర్తి అవుతుంది.

రెండు కాల్ షీట్లకు సరిపోను



అన్నపూర్ణా వారి "పూలరంగడు" లో
చలం, నాగేశ్వరరావు, జమున



"పూలరంగడు" నాగేశ్వరరావు

పతాకసన్నివేశానికి దారి తీసిన సంఘటన ఇది— పూలరంగడు (నాగేశ్వరరావు) వెంకటలక్ష్మి అనే ఎంకి (జమున) ధర్మారావు (గుమ్మడి) సంస్థలో బుర్రకథ ప్రదర్శన జరిపారు. ఆ ప్రదర్శనను ధర్మారావు బావమరిది చలపతి (భానుప్రకాశ్), ధర్మారావు భార్య దేవి (సూర్యకాంతం), వారి కుమార్తె లిల్లీ (గీతాంజలి), ఆమె ప్రియుడూ, చలపతి కుమారుడు బుజ్జి (పద్మనాభం) విన్నారు. వినడమేకాదు టేప్ రికార్డు చేశారు.

పూలరంగడు, ఎంకి తమ బుర్రకథలో...

"కళ్ళు తెరచి నీ దేశ పరిస్థితి ఒక్కసారి కనరా" అంటూ ఒక పెద్ద మనిషి ఎంతటి హైన్యానికి దిగిందీ సైడ్ అట్రాక్షన్‌గా పాడి మాటల పల్లవి వేశారు.

ధర్మారావు, చలపతి భుజాలు తడుముకొన్నారు.

ఔట్‌డోర్ షూటింగ్ బకాయిపడ్డం వల్ల చిత్రం విడుదలలో కొంత విలంబన జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లోను, మద్రాసులోను వాతావరణం చల్లబడడంతో రెండు రోజుల ఔట్‌డోర్ నిలిచిపోయింది.

ఆగస్టు ఆరంభంలో నెగెటివ్ కటింగ్ పూర్తి చేశారు; అంతంలో రీరికార్డింగ్ ఏర్పాట్లయ్యాయి.

ఈ మధ్యలో ఎక్కడ సూర్యుడు తీక్షణంగా ఉంటే అక్కడ ఆ పతాకసన్నివేశంలోని రెండు ముఖ్యభాగాలూ చిత్రీకరిస్తారు. అందులో నాగేశ్వరరావు, జమున, గుమ్మడి, భానుప్రకాశ్ మొదలైనవారు పాల్గొనవలసి వుంది.

ఒక పెద్దమనిషి అంటే ఇద్దరు భుజాలు తడుము కొన్నారు.

ఎవరా ఒక్కరు? బుర్రకథలో ఆ ఇద్దరి బుర్రలు ఢీ కొట్టుకొ[illegible] ఎత్తుగడను గుర్రంబండివాడు (పూల రంగడు), గడ్డి గుమ్మ (ంకి) వేశారు. వారి స్థాయిలో వారు ఆ పెద్దమనిషి ఎవరో కనుక్కొనేం దుకు ఎత్తులు వేశారు. టేప్‌రికార్డర్ ఎలా వినియోగించాలో తెలుసు కొన్నారు. ధర్మరావు, చలపతులపై మిత్రభేదం ప్రయోగించారు. ఫలిం చింది. అందుకు సాక్ష్యం కా ము నడిపించిన టేప్ రికార్డర్. దాని చుట్టు బైకుకు తీశాడు పూలరంగడు. పోలీసులకిస్తే పెద్దమనిషికి శిక్ష ఖాయం. టేప్ రికార్డర్ చు[illegible]ం చేతిలో పట్టుకుని పోలీసుస్టేషన్‌కు [illegible]యలుదేరుతూ వా[illegible] ధ[illegible] చలప[illegible]శారు. ఎత్తుగడ [illegible]ం చారు.

పూలరంగడుపై దౌర్జన్యం [illegible], చక్రం పుచ్చుకుని జీపులో బయలుదేరారు. పూలరంగడు ఆది తన గుర్రం, బండి తీసుకొని సింహంలా వెంబడించాడు.

అదే పతాక సన్నివేశం. గుర్రం బండి జీపును వెంబడించే ఘట్టం హైదరాబాద్‌లో తీశారు. పూల



"పూలరంగడు" లో సూర్యాకాంతం, గుమ్మడి

రంగడు జీపులోకి దూకడంకూడా చిత్రీకరించారు. ఆ సమయంలో ఖండిఇరుసు విరిగిపోయింది. కెమెరా రిజిస్టరు చేసింది. ఉపయోగిస్తున్నారు. జీప్‌లోనూ, ఆ తర్వాత పూల రంగడుకు ధర్మారావు, చలపతిలతో జరిగిన సంఘర్షణాది సన్నివేశాలు ఈ సంచిక వెలువడేసరికి చిత్రీకరించబడి ఉంటాయి.

నాయికా నాయకులు ఒక సినిమా చూస్తూ, అందులో యువతీ యువకుల ప్రేమ విహారం చూసి తాము అట్టి అనుభూతినే ఊహించుకొంటూ ఆడేపాటను, పాడిన పాటను ఈస్ట్‌మన్ కలర్‌లో చిత్రీకరించారు.

సెప్టెంబర్‌లో విడుదలయ్యే "పూలరంగడు" యూనిట్ ముఖ్యులు దుక్కిపాటి మధుసూదనరావు, ఆదుర్తి సుబ్బారావు, ముళ్ళపూడి, ముప్పాళ, దాశరధి, కొసరాజు, ఎన్. రాజేశ్వరరావు, సెల్వరాజ్, టి. కృష్ణ, కృష్ణారావు, నాగేశ్వరరావు, జమున, శోభన్ బాబు, గుమ్మడి, పద్మనాభం, నాగయ్య, ఖాన్ ప్రకాశ్, చలం, అల్లు, విజయ నిర్మల, మాలతి, గీతాంజలి, రాధాకుమారి, నవ గాయకుడు మోహన్‌రాజు.

## "రణభేరి" పగపాట, హంసపాట

ఎన్. టి. రామారావు ఆగస్టు 15వ తేదీ ఉదయం మద్రాసు వాహినీ నాలవ ఫ్లోర్‌లో పి. ఎస్. ఆర్. పిక్చర్స్ వారి 'రణభేరి'కి నిర్మాణ ప్రారంభోత్సవం జరిపారు.

ఆగస్టు 10వ తేదీన పి. ఎస్. ఆర్. పిక్చర్స్ వారు తమ జానపద చిత్రం 'రణభేరి' లో రెండురకాల పాటలను విజయాగార్డెన్స్‌లో రికార్డు చేశారు. బొమ్మకంటి సుబ్బారావును సినిమా కథకునిగా పరిచయం చేసే ఈ చిత్రం యొక్క ఈ రెండు పాటలూ ఈ సంచిక వెలువడేసరికి వాహినీ స్టూడియోస్‌లో చిత్రీకరించబడి వుంటాయి. పింజల సుబ్బారావు నిర్మాత. గిడుతూరి సూర్యం దర్శకుడు. టి. వి. మహారధి సంభాషణ కర్త.

ఓం ప్రథమంగా ఆరుద్ర పగ పాటను (పాడినది ఎస్. జానకి), హంసల జంటపాటను (పాడినది సుశీల, పి బి శ్రీనివాస్) రికార్డు చేశారు. సంగీత దర్శకుడు కోదండపాణి.

మొదటిపాటను ఆరుద్ర, రెండవ పాటను దాశరధి రచించారు.

సంగీత వుటను విజయాధిపతి శ్రీ బి. నాగిరెడ్డి త్రిప్పి "జయం"



డి. బి. ఎన్. వారి "ప్రయివేటు మాస్టారు" లో

సుకన్య, రామ్మోహన్, కాంచన

---

అనగానే పాట రికార్డింగ్ ప్రారంభమైంది.

'నాలోని కోరిక నేడు నాగస్వరం ఊదినదోయి; పగవట్టినా సొగసు పాపమైనది - ఓరాజా, నారాజా' అన్నది మొదటి పాటలోని ముఖ్య భాగం.

వాహినీలో వాణిశ్రీపై చిత్రీకరించబడుతున్న ఈ పాట ఘట్ట విశేషం :

వనకన్య దుర్గ (వాణిశ్రీ) రాజవంశానికి చెందిన ఘనవీరుడైన రాజశేఖరుని (కాంతారావు) వలచి శిథిలురాలైంది. స్త్రీ పగ పాము పగ. రణమల్లు (రాజనాల) మందిరంలో బుసకొట్టింది. ఆ బుసకు సంగీత రూపమే పైది.

రెండవ పాటలో ముఖ్య భాగం :

పుష్పాలలో పువ్వునగా
తశ్వతు నీతో ఉన్నాను

నా మనసే ఊయలగా
ఊగుతు నీలో ఉంటాను

ఇది ఊహా సన్నివేశం. చంద్రశేఖర రాకుమారుని (రామకృష్ణ) చూచిన రాకుమారి స్వప్నిస్తుంది. కలువలకొలను. నాలుగు కలవలు నాలుగు హంసలు అయినాయి. హంసాద్వీపం అవుతుంది రాణిహంస ను చూచి రాజహంస వస్తుంది. తక్కిన హంసలు తప్పుకుంటాయి. హంస కన్య భావం పైన పేర్కొన్నది.

రాజహంస సమాధానమిచ్చింది:
రాజ్యాలేల భోగాలేల
ఏవేదాలు లేవే
నీతో పొందు ఎంతో విందు
నాతో చేరిపోవే

హంస ద్వయం ఆనంద విహారం చేస్తూవుంటే రాక్షసి డేగ (జయకృష్ణ) వచ్చి గగన మండలం లోకి రెండింటిని తన్నుకు పోతుంది. రాణిహంస కలవరపడుతున్నది డేగ సాక్షాత్తూ తన అన్న. తన ప్రేమ పావురం పాలిటి నిజమైన డేగ. ఆమె కలవరం పరాకాష్ట నొందింది.

హంసల పరస్పరం సంబంధించిన వన్నివేశంలో చాలా ట్రిక్ షాట్ లున్నాయి

ఈ సంచిక వెలువడే పరికి వన కుటీరం సెట్‌లో కాంతారావు, రాజశ్రీ ఏడిద నాగేశ్వరరావు, బాల కృష్ణల పైన, అశ్వశాల సెట్‌లో కాంతారావు, రాజనాల, ధూళిపాళ లపైన చిత్రీకరణ జరిగి వుంటుంది.

## రెండు పండుగలకు కె. వి. రెండు చిత్రాలు

విజయావారి "ఉమ చండి గౌరి కథ" లో ఒక ప్రత్యేకాంశం బి. సరోజాదేవి త్రిపాత్రాభినయం. ఆగస్టులో మరి కొంత నిర్మాణం జరిగింది. జయంతివారి జానపదం ఈ చిత్రం కంటె ముందే సిద్ధం కావచ్చు. ఒకటి సంక్రాంతి ప్రాంతాల, మరొకటి ఉగాది ప్రాంతాల విడుదల కావచ్చు. రెండు చిత్రాల ముఖ్యులు కె. వి. రెడ్డి, పింగళి నాగేంద్రరావు, ఎన్. టి. రామారావు, బి. సరోజాదేవి, పెండ్యాల నాగేశ్వరరావు.

* * *

## మరొక హైదరాబాద్ చిత్రం

తమ్మారెడ్డి కృష్ణమూర్తి అధ్యక్షన రవీంద్రావారు హైదరాబాద్‌లో తీయబోయే సాంఘికానికి సి. యన్. రావు దర్శకత్వం వహిస్తారు. నాగేశ్వరరావు ముఖ్య నటుడు. త్వరలో సెట్స్‌కు వెడతారు



**మధుపిక్చర్స్ ప్రొడక్షన్ నం. 4 ముహూర్త సమయంలో**
**క్లాప్ కొడుతున్న చక్రపాణి మేకప్‌లో నాగేశ్వరరావు, గుమ్మడి**

---

డేరాడూన్‌లో ఉంటున్నాడు. ఏదో పనిపైన డార్జిలింగ్ వచ్చి ఆదుర్తితో నేస్తం కలిపారు.

కొత్త కథకుడు అనగానే ఆదుర్తికి ఆసక్తి కలిగింది. తానొక ప్రయోజనాత్మక చిత్రకథ కోసం వేట సాగిస్తున్నా నన్నారు.

థాపా ఒక ఐడియా ఇచ్చారు. అది ప్రపంచసమస్య. పండిత జవహర్‌లాల్ నెహ్రూ వాక్యం కూడా అందులో ఉంది.

నేటి బాలలే రేపటి పౌరులు. నేటి పౌరులు—అనగా తల్లిదండ్రులు తమ పిల్లలను భావిపౌరులుగా తీర్చి దిద్దగలుగుతున్నారా?

ఆదుర్తికి ఐడియా నచ్చింది కానివ్వమన్నారు. కానిచ్చారు. కథ ఒక రూపానికి వచ్చింది.

10 వేల అడుగులలోపు నిడివి వుండే ఈ చిత్రంలో పాటలు అంటూ వుండవు. ముఖ్య నటుడు నాగేశ్వరరావే న్యాయవాది వేషం వేస్తారు. విగ్గు తప్పితే మేకప్ వుండదని తెలుస్తున్నది.

బేబి రోజారమణిని ఒక భూమికకు బుక్ చేశారంటున్నారు.

సెప్టెంబర్ అంతంలో షూటింగ్ ప్రారంభించి నవంబర్‌కు చిత్రం సిద్ధంచేయాలని అనుకొంటున్నారట. సంభాషణలు నంది, కెమెరా కె రామకృష్ణారావు

***

# అదీ ఇదీ

"చూస్తూ వుండండి నేను మేరిలిన్ మన్రో కంటె గొప్ప దాన్నయిపోతాను. ఆమె కున్నవన్నీ నాకూ వున్నాయి. కొంచెం ఎక్కువే వున్నాయి" అని ఒకసారి ఒక హాలీవుడ్ తార ఛాలెంజి చేసింది.

ఆమె పేరు జేన్ మాన్స్ ఫీల్డు. ఇటీవలే (జులై, 67) ఆమె ఒక కారు ప్రమాదంలో అకాల మరణం పొందింది

జేన్ మాన్స్ ఫీల్డు హాలీవుడ్ తార కావడానికి చాలా ప్రయాస పడింది హాలీవుడ్



తారకు కావలసిన లక్షణాలన్నీ తన అరవై టినుంచే తనకున్నాయని ఆమె ఒకసారి అన్నది కాని చాల కాలందాకా హాలీవుడ్ నిర్మాతలెవరు ఆ సంగతిని అంగీకరించలేదు వారిచేత ఆ సంగతిని గుర్తింపచేయడానికి ఆమె హాలీవుడ్ చరిత్రలోనే అపూర్వమైన పబ్లిసిటీ కాంపెన్ నడిపింది మొదటి రోజుల్లో ఆమె ఇంటింటికి తిరిగి ఫొటో ఆల్బమ్స్ అమ్మేది పత్రికల కార్యాలయాలకు వెళ్లి తన ఫొటోలు పంచిపెట్టేది

"చాల మంది స్త్రీలు ఏవేవో దుస్తులు ధరిస్తారు నాకు నేను నేనుగానే వుండటం ఇష్టం" అనేది ఆమె సూత్రం. ఆమె ఫొటోలన్నీ ఈ సూత్రం ప్రకారమే వుండేవి

ఈ పబ్లిసిటీ మహిమవల్ల జేన్ మాన్స్‌ఫీల్డు హాలీవుడ్ చిత్రాలలో ప్రవేశించడానికి ముందే అమెరికా అంతట్లా ఆమె పేరు మారుమోగిపోయింది అప్పటికీ ఆమెను హాలీవుడ్ నిర్మాతలు అంగీకరించ లేదట చివరకు "విల్ సక్సెస్ స్పాయిల్ రాక్ హంటర్?" అనే నాటకంలో ఆమె నటించగా చూసి ఫరవాలేదని నిర్మాతలు ఆమెను బుక్ చేయడం జరిగింది

ఆమె నటన చెప్పుకోదగ్గది కాదు అందంకూడా అంతంత మాత్రమే చిన్నకళ్ళు, పెద్ద ముక్కు. కావి, ఆ కళ్లల్లో ఏదో అమాయకత్వం వుండేది ఆ అమాయకత్వానికి, ఆమె శరీరపు కొలతలకి (40"-21-35 1/2") ఎక్కడా పొంతన వుండేది కాదు ఆ కొలతలను ఆమె దాచుకోనేది కూడా కాదు దానితోనే ఆమె (మెరిలిన్ మన్రోతో పోలికకురాక పోయినా) తారగా విజయం సంపాదించింది

* * *

ఇంతలోనే రాలిపోయిన మరొక ప్రఖ్యాత తార వివియన్ లీ. అయితే, జేన్‌మాన్స్ఫీల్డు తరహా వేరు. ఈమె తరహా వేరు. నిజమైన నటిగా ఈమె ప్మృతి చలన చిత్రాల చరిత్రలో నిలిచి పోతుంది.

కొన్నేళ్ళ క్రిందటిదాకా "గాన్ విత్ ది విండ్" చిత్రం బాక్సాఫీస్ హిట్‌కు మరోపేరుగా వుండేది. ఆ చిత్రంలో స్కార్లెట్ ఓహారా పాత్ర ధరించిన వివియన్ లీ నటన ఎన్నటికీ మరుపు రానిది. ఆ చిత్రంలో నటనకే ఆమెకి



1939 లో ఆస్కార్ బహుమతి వచ్చింది. 1951 లో మరొక సారి ఆమెకిఅదేబహుమతి "ఎ స్ట్రీట్ కార్ నేమ్డ్ డిజైర్" (టెన్నెసీ విలియమ్స్ నాటకం ఆధారంగా తీసిన చిత్రం) లో స్కూల్ టీచరు "బ్లాంచీ" పాత్రధారణకు లభించింది.

వివియన్ లీ 1913 లో బెంగాల్ లోని డార్జీలింగ్‌లో జన్మించింది. లండన్‌లో మొదట నాటక రంగంలో ప్రవేశించి పేరు తెచ్చుకుంది. భర్త సర్ లారెన్స్ ఒలీవియర్‌తో కలిసి షా నాటకం "సీజర్ అండ్ క్లియో ప్కాట్రా"లో, షేక్స్పియర్ నాటకం "ఆంటొనీ అండ్ క్లియొపాట్రా" లో, ఇంకా ఎన్నో నాటకాలలో ఆమె అపూర్వ నటనాశక్తిని ప్రదర్శించింది. ఆమె చిత్రాలలో ఎన్నదగినవి "సీజర్ అండ్ క్లియొపాట్రా", రాబర్ట్ టేలర్‌తో కలిసి నటించిన "వాటర్లూ బ్రిడ్జి", "అనా కెరినినా" మొదలైనవి.

ఏచిత్రంలో నటించినా, ఆమె అందమైన రూపం, విషాద మిశ్రితమైన మన స్తత్వం ఆయా పాత్రలకు సరిగా అతికినటుండేవి ఆమెమరణంతో చలన చిత్రరంగం ఒక గొప్ప నటిని కోల్పోయింది.

◆ ◆ ◆

హాస్యనటుడు జెర్రీ లూయిస్ ప్రస్తుతం అమెరికాలో కంటె యూరప్ లోనే ఎక్కువ పాప్యు లర్‌గా వున్నాడట అలాగే ప్రెసిడెంటు జాన్సన్ యూరప్‌లో కంటె అమెరికాలోనే ఎక్కువ పాప్యులర్ గా వున్నారట ఆయన వియత్నాం విధానం మీద యూరప్ లో, ముఖ్యంగా ఫ్రాన్సులో తీవ్ర విమర్శలు వెలువడుతున్నాయి.

ఆ మధ్య జెర్రీలూయిస్ కాన్స్ చలన చిత్రోత్సవానికి హాజరైనప్పుడు అక్కడ ముఖ్యాకర్షణలలో అతనొకడు. పత్రికా విలేఖరులు ఫిలిం విమర్శకులు, ఇతరప్రముఖుల వందలాది అతన్ని చుట్టుముట్టారు జెర్రీలూయిస్ సినిమాల్లోడయలాగ్ చెప్పినంత వేగంగా, రెడీగా, చిట్టిగ సమాధానాలు చెబుతున్నాడు

జ్యోతి

అంతల్లో ఒక విలేఖరి 'ప్రెసిడెంటు జాన్సన్ మీద మీ అభిప్రాయం ఏమి' అని లూయిస్‌ని అడిగాడు.

తమ ప్రెసిడెంట్‌ను ఇతరులు న్యూన భావంతో చూడటం ఇష్టం లేనట్లు మొహం పెట్టాడు లూయిస్. తడుముకోకుండా గబగబ "ఆయన మా ప్రెసిడెంటు. మా నాయకుడు. ఆయన్ని నేను గౌరవిస్తాను. ఆయన మాటని శిరసా వహిస్తాను..." అంటూ చెప్పుకుపోయాడు. కొంత సేపు ఆగాడు. మొహమాటానికి, మర్యాదకోసం కొందరు చప్పట్లు కొట్టారు. ఇంతలో లూయిస్ మళ్ళీ అందుకుని "అయితే, ఆయన ప్రెసిడెంట్‌గా వుండ తగడని నా అభిప్రాయం..." అన్నాడు. గొల్లున నవ్వులతో హాలు ప్రతిధ్వనించింది.

* * *

ఫిలిప్పీన్స్ ప్రభుత్వం ఏటేటా ఒక ప్రసిద్ధుడైన ఆసియన్ పౌరుడికి ఇచ్చే "సాహిత్య-జర్నలిజం" బహుమతిని ఈ ఏడాది సత్యజిత్‌రాయ్‌కు ఇచ్చింది. 1957లో విమాన ప్రమాదంలో మరణించిన ఫిలిప్పీన్స్ అధ్యక్షుడు రేమన్ మేగ్‌సేసే పేరిట ఈ బహుమతి ప్రదాన సంప్రదాయాన్ని ఏర్పాటు చేశారు. ఈ ఏడాది ఒక చలనచిత్ర కళాకారుడు ఈ బహుమతి పొందడం విశేషం. బహుమతి విలువ పదివేల డాలర్లు.

1954లో "పథేర్ పాంచాలి"తో మొదలు పెట్టి సత్యజిత్‌రాయ్ చాలా గొప్ప చిత్రాలు నిర్మించి ప్రపంచ ప్రఖ్యాతి పొందాడు. భారతీయ చలన



చిత్రాల పట్ల విదేశీయులకు ఆసక్తి గలగ డానికి అతడు ఒక విధంగా కారకుడయ్యాడు. ఇండియాలో కూడా ప్రయోగాత్మక, ప్రయోజనాత్మక చిత్రాలపట్ల నానాటికి ఆసక్తి పెరగడానికి అతడు చేసిన దోహదం చాలా వుంది

భారత ప్రథమరాష్ట్రపతి జీవిత చరిత్రను చలన చిత్రంగా నిర్మించ వలసినదిగా రాజేంద్రప్రసాద్ స్మారక సంఘం ఈమధ్య సత్యజిత్ రాయ్‌ను కోరింది.

—"రాజేంద్ర"

***

Edited and Published by **V. V. Raghavaiah**
and Printed by him at **Jyothi Printers**

# చలన చిత్ర వార్తలు

## హైదరాబాద్‌లో రెండు చిత్రాల రచన

వార్ల చిరంజీ హైగ క్ వుండి రెండు చిత్రాలకు స. ష ణలు సమకూర్చుతున్నారు క్ష్మి రమణావారి సాంఘికానికి సంభా

షణలు దాదాపు పూర్తి చేశారు. సీతారామాంజనేయ పిక్చర్స్‌వారి హాస్య సాంఘికానికి కూడా ఆయన సంభాషణలు వ్రాస్తున్నారు. రెండు చిత్రాలకు గిడుతూరి సూర్యం దర్శకుడు.



రవిప్రొడక్షన్స్ వారి
"గొప్పవారి గోత్రాలు" లో
దుష్టపాత్రధారిణి కుమారిలక్ష్మి



రవిప్రొడక్షన్స్ వారి
"గొప్పవారి గోత్రాలు" లో
కొత్త దుష్ట పాత్రధారి
అంజిబాబు

## సాంఘిక "భామావిజయం" అనే "తారాభామ"

తమిళంలో "భామా విజయం" పేరిట తీయబడి విజయవంతమైన చిత్రాన్ని తెలుగులో పునర్నిర్మిస్తు న్నారు. జెమిని స్టుడియోస్‌లో జరి గిన చిత్రీకరణలో రంగా రావు, రామకృష్ణ, రాజశ్రీ, కాంచన

ముదనష్టపువాళ్లొచ్చారు. దర్శకుడు కె. బాలచందర్. రచన: భమిడిపాటి రాధాకృష్ణ. 'భామా విజయం' ఒక సినిమాతారా భామ కథ.

సినిమా స్టార్ పోజులు, ఆడంబరాలు సంసార స్త్రీలు చూసి ఆ 'వాతలు' పెట్టుకోడానికి, ఆ 'నెమలి ఈకలు' తొడుగుకోడానికి భర్తలను పెట్టే తిప్పల చుట్టూ కథ తిరుగుతుంది. సంసారపు లోటు బడ్జెట్లపై చక్కటి పాట ఒకటి వుంది.

## రష్యాలో చంద్రశేఖరం మేకప్ ప్రదర్శనలు

సుప్రసిద్ధ మోనో యాక్టర్ డాక్టర్ చంద్రశేఖరం భారత స్వాతంత్ర్య వార్షికోత్సవం సందర్భంగా ఉజ్బెక్ సాంస్కృతిక సంఘంవారు తాష్కెంట్ లో ఏర్పాటు చేసిన సాంస్కృతిక ప్రదర్శనలలో మేకప్ ప్రదర్శనలిచ్చారు. గాంధీ, నెహ్రూ, టాగూర్, లెనిన్, మార్క్స్, ఎంగిల్స్ మొదలైన వారి రూపాలను ఆయన ధరించారు. ఏడుగురు సభ్యులు కల భారత సాంస్కృతిక ప్రతినిధివర్గం ఆగస్టు 9న ఢిల్లీ నుంచి మాస్కో వెళ్ళింది అక్కడి నుంచి ఉజ్బెకిస్తాన్ వెళ్ళింది.

## అక్కినేని, ఆదుర్తి గార్ల అపూర్వ ప్రయోగం

ఆగస్టు 15వ తేదీన హైదరాబాద్‌లో చక్రవర్తి చిత్రవారి తొలి చిత్రానికి ప్రారంభోత్సవం జరిగింది.

అన్నపూర్ణావారి 'డాక్టర్ చక్రవర్తి' బంగారునంది సంపాదించిన సమయంలో ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, [illegible] మంత్రి డాక్టర్ చెన్నారెడ్డి చేసిన ప్రబోధమే చక్రవర్తి చిత్ర సంస్థాపనకు కారణమైంది.

చలనచిత్ర కళలో కళ అనేది సార్థకం కావాలనే ఆశయంతో అక్కినేని, ఆదుర్తి కలిసి ఈ సంస్థను నెలకొల్పారు. 1966 ప్రథమార్థంలోనే కథలవేట ప్రారంభించారు. కథలు విన్నారు, నవలలు చదివారు. 300 పైచిలుకు కథలు పరిశీలించారు. కొత్త రచయితలైతే కొత్త ఐడియాలు వస్తాయని ఆదుర్తి నమ్మకం.

ఇంతలో అజంతా ఆర్ట్స్ హిందీ చిత్రం నిర్మాణ సందర్భంలో ఆదుర్తి డార్జిలింగ్ వెళ్ళారు.

అనుకోకుండా తలవని తలంపుగా ఒక నేపాలీ ఎమ్.ఏ.బి.ఎల్. తగిలాడు. ఆయన పేరు [illegible] బి. ఎన్. థాపా.

ఒక పెద్దమనిషి అంటే ఇద్దరు భుజాలు తడుము కొన్నారు.

ఎవరా ఒక్కరు? బుర్రకథలో ఆ ఇద్దరి బుర్రలు .ధీ కొట్టుకొన ఎత్తుగడను గుర్రంబండివాడు (పూల రంగడు), గడ్డి గుమ్మ (?కి) వేశారు. వారి స్థాయిలో వారు ఆ పెద్దమనిషి ఎవరో కనుక్కొనటం దుకు ఎత్తులు వేశారు. టేప్ రికార్డర్ ఎలా వినియోగించాలో తెలును కొన్నారు. ధర్మరావు, చలపతులపై మిత్రభేదం ప్రయోగించారు. ఫలిం చింది. అందుకు సాక్ష్యం కాము నడిపించిన టేప్ రికార్డర్. దాని చుట్టు బైటకు తీశాడు పూలరంగడు. పోలీసులకిస్తే పెద్దమనిషికి ఉరిశిక్ష ఖాయం. టేప్ రికార్డర్ చ??ం చేతిలో పట్టుకుని పోలీసుస్టేషనుకు ?యలుదేరుతూ ఫ? ధ????, చలప ??శారు .త్తుగడ ?? ?ం చారు.

పూలరంగడుపై దౌర్జ?? ??గ?? , చక్రం వ్యూహ?? ?? బయలుదేరారు. పూలరంగడు ??ది తన గుర్రం, బండి తీసుకొని సింహంలా వెంబడించాడు.

అదే వరాక పన్నివేశం. గుర్రం బండి జీవును వెంబడించే ఘట్టం హైదరాబాద్‌లో తీశారు. పూల



"పూలరంగడు" లో సూర్యకాంతం, గుమ్మడి

రంగడు ఊపులో దూకడంకూడా చిత్రీకరించారు. ఆ సమయంలో ఖండి ఇరుసు విరిగిపోయింది. కెమెరా రిజిస్టరు చేసింది. ఉపయోగిస్తున్నారు. జీవులోనూ, ఆ తర్వాత పూలరంగడుకు ధర్మారావు, చలపతిలతో జరిగిన సంఘర్షణాది సన్నివేశాలు ఈ సంచిక వెలువడేసరికి చిత్రీకరించబడి ఉంటాయి.

నాయికా నాయకులు ఒక సినిమా చూస్తూ, అందులో యువతీ యువకుల ప్రేమ విహారం చూచి తాము అట్టి అనుభూతినే ఊహించుకొంటూ ఆడిన ఆటను, పాడిన పాటను ఈస్ట్మన్ కలర్‌లో చిత్రీకరించారు.

సెప్టెంబర్‌లో విడుదలయ్యే "పూలరంగడు" యూనిట్ ముఖ్యులు దుక్కిపాటి మధుసూదనరావు, ఆదుర్తి సుబ్బారావు, ముళ్ళపూడి, ముప్పాళ, దాశరధి, కొసరాజు, ఎస్. రాజేశ్వరరావు, సెల్వరాజ్, టి. కృష్ణ, కృష్ణారావు, నాగేశ్వరరావు, జమున, శోభన్ బాబు, గుమ్మడి, పద్మనాభం, నాగయ్య, భానుప్రకాశ్, చలం, అల్లు, విజయనిర్మల, మాలతి, గీతాంజలి, రాధాకుమారి, నవ గాయకుడు మోహన్‌రాజు.

## "రణభేరి" పగపాటూ హంసపాటు

ఎన్. టి. రామారావు ఆగస్టు 15వ తేదీ ఉదయం మద్రాసు వాహినీ నాలవ ఫ్లోర్‌లో పి. ఎస్. ఆర్. పిక్చర్స్ వారి "రణభేరి"కి నిర్మాణ ప్రారంభోత్సవం జరిపారు.

ఆగస్టు 10వ తేదిన పి. ఎస్. ఆర్. పిక్చర్స్ వారు తమ జానపద చిత్రం 'రణభేరి' లో రెండు రకాల పాటలను విజయాగార్డెన్స్‌లో రికార్డు చేశారు. బొమ్మకంటి సుబ్బారావును సినిమా కథకునిగా పరిచయం చేసే ఈ చిత్రం యొక్క ఈ రెండు పాటలూ ఈ సంచిక వెలువడేసరికి వాహినీ స్టూడియోస్‌లో చిత్రీకరించబడి వుంటాయి. పింగళ సుబ్బారావు నిర్మాత. గిడుతూరి సూర్యం దర్శకుడు. టి. వి. మహారధి సంభాషణ కర్త.

ఓం ప్రథమంగా ఆరుద్ర పగ పాటను (పాడినది ఎస్. జానకి), హంసల జంటపాటను (పాడినది సుశీల, పి బి శ్రీనివాస్) రికార్డు చేశారు. సంగీత దర్శకుడు కోదండపాణి.

మొదటిపాటను ఆరుద్ర, రెండవ పాటను దాశరధి రచించారు.

సంగీత వుటను విజయాధిపతి శ్రీ బి. నాగిరెడ్డి త్రిప్పి "జయం"

# జ్యోతి క్విజ్

| | అవును | కాదు |
|---|---|---|
| 1. మీరు జ్యోతి ఈ నెలే మొదటి సారిగా చదువుతున్నారు. | | |
| 2. ఆరు నెలల నుంచి చదువుతున్నారు. | | |
| 3. ఏడాది నుంచి | | |
| 4. మూడేళ్ళ నుంచి | | |
| 5. మొదటినుంచి (1963 ఫిబ్రవరి) | | |
| 6. జ్యోతి మీరు ప్రతి నెల కొని చదువుతున్నారు. | | |
| 7. ఏడాది చందా ఒక్కసారే కట్టి తెప్పిస్తున్నారు. | | |
| 8. మీ జ్యోతిని ఇంకెవరికీ ఇవ్వరు. | | |
| 9. జ్యోతిలో మీకు ఏదైనా నచ్చితే ఇతరులకు వెంటనే చదివి వినిపిస్తారు | | |
| 10. జ్యోతికాక ఇతర పత్రికలు కూడా చదువుతూ ఉంటారు. | | |

ఈ ప్రశ్నలకు మీరు "అవును" – "కాదు" ఏ సమాధానం ఇచ్చినా రైటే. మీరు "జ్యోతి" పాఠకులని నిర్ధారణగా చెప్పవచ్చు. ఇంత కంటె కరెక్టు సమాధానం మరేముంటుంది?